శా. పాథోరాశిగభీరుఁ డుజ్జ్వలకళాపారీణుఁ డైనట్టి శ్రీ
నాథుం దన్నకవీశ్వరోత్తముసుతన్ సందంబుగాఁ బెండ్లియై
సాధుస్తోత్రగుణైన సూనులను భాస్వత్తేజులం గాంచె భూ
నాథుల్ మెచ్చఁ బ్రపంచశాలులను సన్మార్గక్రియాలోలుతన్.

క. వారలమాతామహుఁ డతి
కూరిమితో నింట నుంచుకొని పెంచుటచే
నారూఢిగ శ్రీనాథుని
వారైన త్రిల్లి రొగిని వసుధాస్థలిలోన్.

క. వారలవంశపరంపర
లారూఢిగ విస్తరించె నతివిభవమునన్
వారిలొ మాధవమంత్రియు
ధారుణిలోఁ బొగడు గనియె ధన్యత మెఱయన్."

రామాభిషేకము నాకు లభింపకపోవుటచే నీవిషయమున నిఁక నేమియు వ్రాయఁజాలను.

శ్రీనాథకవి చారిత్రమున వ్రాయవలసిన విషయము లింక ననేకములున్నవి. అయిన నిది యిదివఱకే యతివిస్తరమైనందున నింతతో నీతనిచరిత్రమును ముగించుచున్నాఁడను.

—: అనపర్తి శాసనము :—

శ్రీనాథునిచారిత్రమును బూర్తిచేసినపిమ్మట నేను రెడ్డిసంచికలోఁ బ్రకటితమైన "అనపర్తి" శాసనమును జూచుట తటస్థించినది. అందు రెండు మూఁడు ముఖ్యాంశములున్నందున వానినీక్రిందబొందుపఱుచుచున్నాఁడను. ఈగ్రామము గోదావరిమండలమున రామచంద్రపురము తాలూకాలోనున్నది. దానకాలము శా. శ. ౧౩౧౭ వైశాఖ శుక్లసప్తమి (క్రీ శ. ౧౩౯౦) ఈశాసనమువలనఁదెలియు విషయములు.

౧. అనపోతారెడ్డికుమారుఁడైన కుమారగిరిరెడ్డికి వీరఅనపోతారెడ్డి అను కుమారుఁడు కలఁడు. అతనిని తనతొడలమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని కుమారగిరి ద్రాక్షారామమునందులాపురుషదానము గావించెను.

౨. కుమారగిరిరెడ్డి, తనకుమారునకుఁ గొంతరాజ్యమును సంపాదింపవలయునను నుద్దేశముతోఁ దనబావమఱఁదియు, సమర్థుఁడు నగు కాటయవేమునకుఁ దూర్పుదిశనున్న రాజులను, సింహాచలమున కావలనున్న రాజులనుజయించి, యారాజ్యమును దనరాజ్యములోఁ గలిపివేయవలయుననియాజ్ఞాపింప నాతఁడు ప్రచండసైన్యముతో రాజమహేంద్రవరమునకువచ్చి అచ్చట శుకబ్రహ్మచే స్థాపితుఁడైన గోపాలస్వామిని దర్శించి, తనజైత్రయాత్రయందు జయము నొసంగుమని ప్రార్థించి, తూర్పుదిశనున్న రాజులను, ఉత్తరమున వింధ్యాద్రి దక్షిణమున సింహాద్రిమధ్యనున్న దేశములను జయించెను. కటకము రాజధానిగాఁగల గజపతి (నాల్గవ వీరనరసింహదేవుఁడు) యొద్దకప్పమును గైకొని, మదపుటేనుగులను, గుఱ్ఱములను, నమూల్యరత్నాభరణాదులను గ్రహించి, తెచ్చి కుమారగిరిరెడ్డికి సమర్పించెను. కుమారగిరి చాలసంతసించి తనబావమఱఁదిని మిగుల గౌరవించి క్రొత్తగా సంపాదించినరాజ్యమునకుఁ దనకుమారుఁడైన వీరాన్నపోతారెడ్డిని రాజప్రతినిధిగ నియమించి యతనికిఁ దోడుగఁ గాటయవేముని రాజమహేంద్రవరమున నుండున ట్లేర్పాటు గావించెను.

3 రాజమహేంద్రవరము నందలిగోపాలస్వామి యనుగ్రహమునఁ దనకీవిజయము సంప్రాప్తమైనదనితలంచి తనయేలికయగు వీరాన్నపోతారెడ్డితోఁ జెప్పి యాస్వామికి అనపర్తియనుగ్రామమునిప్పించి కాటయవేముఁ డీశాసనమును వ్రాయించెను. శాసనకావ్యకర్త మనుమదుర్గమనుఘుఁడును. పిన్నయార్యుని కొడుకు నగు అన్నయ

కవి. ఈశాసనకర్త వీరాన్నపోతారెడ్డియే యైనను నిందుఁ గొమరగిరియే వ్రాలు చేసియుండెను.

ఈశాసనమువలన క్రీ. శ. ౧౩౯౦ నాఁటికి కొమరగిరిరెడ్డి కొడుకు అనపోతారెడ్డి జీవించియున్నట్లు తెలియుచున్నది అతని జీవితకాలములో నాతనికి సాహాయ్యముగఁ గాటయవేమారెడ్డి రాజమహేంద్రవరమున నుండెను. కుమారాన్నపోతారెడ్డి ౧౩౯౦-౧౪౦౩ నడుమఁ జనిపోయి యుండును. అతనియనంతరమునఁ గాటయవేమునకు రాజమహేంద్రవర రాజ్యమును కుమారగిరిరెడ్డి యిచ్చియుండును. దీనినిబట్టి కుమారగిరిరెడ్డి తనసోదరి కారాజ్యము నరణముగా నిచ్చియుండ లేదని స్పష్టమగుచున్నది. అనితల్లి కలునచేటు శాసనవిషయముల నీయనపర్తి శాసనము బలపఱుచుచున్నది క్రీ శ. ౧౩౯౦కి, ఇంచుకపూర్వమే కాటయవేముఁడు కళింగాదిరాజ్యములను జయించెననుటకూడ నిశ్చయము. రాజమహేంద్రవరమును దత్ప్రాంతప్రదేశములును నదివఱకే, కొమరగిరిరెడ్డి పరిపాలనములో నున్నవని యంగీకరించినను, అంతకుపూర్వ మా ప్రదేశమును గాటయవేమున కిచ్చియున్నట్లు తలంపరాదు. అట్లిచ్చియున్నచో వీరాన్నపోతారెడ్డిని రాజమహేంద్రవరమున రాజప్రతినిధిగ నియమించుట జరిగియుండదు. వీరాన్నపోతారెడ్డి స్వాభావికముగఁ గాలధర్మము నొందెనో యే యుద్ధములోనైన నిహతుఁ డయ్యెనో తెలియదు. అతనికిఁ బరిణయమయ్యెనో లేదో తెలియదు. కుమారగిరిసోదరీనామ మనపర్తి శాసనమువలనఁ గూడఁ దెలియ లేదు.

—: అలభ్యములైన శ్రీనాథునికృతులు :—

శ్రీనాథునికృతులలో నిప్పుడు మనకు దొరకుచున్నవానినిం గూర్చి పైనవ్రాసియుంటిని. ఇఁక లభ్యముకాని కృతులాఱుకలవు. ౧ మరుత్తరాట్చరిత్ర. ౨ పండితారాధ్యచరిత్రము. ౩ శాలివాహనసప్తశతి. ౪ నందనందనచరిత్రము. ౫ మానసోల్లాసము ౬ ధనంజయ

విజయము. ఇందుఁ బండితారాధ్యచరిత్రమును మామిడిపెగ్గడయ్యకును, ధనంజయవిజయమును గన్నభూపాలునకును గృతియిచ్చినట్లు గ్రంథస్థనిదర్శనము లుండుటచే వానినిగూర్చి పైన వ్రాసియుంటిని. మరుత్తరాట్చరిత్రమును శాలివాహనసప్తశతిని దాను రచియించితినని శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు. కాని వాని కృతిపతులెవ్వరో చెప్పలేదు. వీనినిగూడ మామిడి పెగడయ్యకే కృతి యిచ్చెనేమో చెప్పలేము.

మరుత్తుఁడను రాజుచరిత్ర భారతాశ్వమేధపర్వమునను, మార్కండేయ పురాణమునను గలదు. ఐతరేయ బ్రాహ్మణమునను గలదఁట! ఈ రాజనేక యజ్ఞములను గావించుచుండనందులకు సహింపలేక దేవేంద్రుఁ డాతని జన్నమునకు విఘ్న మొనర్ప యత్నించుచు బృహస్పతిని మరుత్తునియజ్ఞమునందుపద్రష్టగా నుండవలదని యాజ్ఞాపించెను. ఇంద్రునకును బృహస్పతికిని భయపడి మఱియెవ్వరును మరుత్తుని యజ్ఞమును జేయించుట కంగీకరింపరైరి. నారదుఁ డారాజు కడకువచ్చి "బృహస్పతిచే నవమానితుఁడై యాతనిసోదరుఁడు సంవర్తుఁడనువాఁడు తపము గావించుచున్నాఁడనియు, నాతఁ డున్మత్తుని వలెఁ దిరుగుచుండుననియు నాతనిని బ్రతిమాలి యంగీకరింపఁ జేసిన నాతఁడు జయప్రదముగ నీయధ్వరమును గొనసాగించుననియుఁ" జెప్పెను. మరుత్తుఁ డట్లే యొనర్చి సంవర్తునిచే యజ్ఞమును గొనసాగించెను. ఇది మరుత్తుఁడను రాజుకథయందలి ప్రధానాంశము. శ్రీనాథుఁ డీకథనే విస్తరించి యీగ్రంథమునురచించియుండును. శ్రీనాథుని బాల్యరచనములు లభింపకపోవుట ఆంధ్రలోకమునకు విచారకరమైన విషయము.

శాలివాహనసప్తశతి యనుగ్రంథమును నూత్నయౌవనమున రచియించితినని శ్రీనాథుఁడు చెప్పియున్నాఁడు. సాతవాహనుఁ డను నాంధ్రరాజు ఏడువందల యార్యావృత్తములు గలయొక శృంగార గ్రంథమును ప్రాకృతభాషలో రచియించెను. సాతవాహనుఁడు

హాలుఁడని శాలివాహనుఁడని నామాంతరము లున్నవని యందురు. సాతవాహన శాలివాహనులు భిన్నులని కొందఱిమతము. పద్యములో "శాలి" అనియేయున్నది కానిదానిని "సాత" అనిదిద్దిన దిద్దవచ్చును. ఈవిషయమైనచర్చ యిట నప్రస్తుతము. ఇది యొక కథతోఁ గూడిన కావ్యము కాదు. నాయికానాయకుల హావభావలీలావిలాసాదులు శ్లోకమున కొకవిధముగా నిందువర్ణితములైనవి. ఏశ్లోకమున కాశ్లోకమే యొకకథ యనుకొనవచ్చును. ఇం దనుస్యూతమైన యొకకథ లేదు. ఈగ్రంథమిప్పుడెచ్చటను కనుపట్టుట లేదు. లక్షణగ్రంథమునం దుదాహృతమైన యీ క్రిందిపద్య మొక్కటియే యిప్పుడు లభించుచున్నది.

ఉ. వారణసేయఁ దావకొనవా? నవవారిజమందుఁ దేటి కొ
వ్వారుచునుంట నీవెఱుఁగవా? ప్రియ! హా! తెఱగంటి కంటికె
వ్వారికిఁ గెంపురాదె? తగవా మగవారలదూఱ! నీవిభుం
డారసి నీనిజం బెఱుగునంతకు నంతకు నోర్వు! నెచ్చెలీ!

ప్రాకృతసప్తశతియందలి ప్రశస్తములైన నూఱుశ్లోకములకుఁ బెదకోమటి వేమారెడ్డి వ్యాఖ్యరచియించెనఁట!

శ్రీనాథుఁడు నందనందన చరిత్రము, మానసోల్లాసము అను గ్రంథములను రచియించెనని వాడుక కలదు. కాని గ్రంథస్థ నిదర్శనములు నాకులభింపలేదు. నందనందనచరితమున శ్రీకృష్ణునికథలు వర్ణితములై యుండుననుమాట స్పష్టము. శైవుఁ డగునీతఁడు కృష్ణకథను రచించియుండునా? యని కొందఱు ప్రశ్నించుచున్నారు. పల్నాటి వీరచరిత్రమును చెన్నకేశవునికిఁ గృతియిచ్చిన ట్లంగీకరించితి మేని, నందనందనచరిత్రమును రచియించెననియు నంగీకరింపవచ్చును. వైష్ణవమతాభిమాని యైన మైలారరెడ్డిచే దినవెచ్చమును గైకొనిన శ్రీనాథుఁడు నందనందనచరిత్రమును రచించినాఁడనుటలోఁ దప్పులేదు. ఇంతకును నాగ్రంథము లభింపనప్పుడు విశేషచర్చతోఁ బనిలేదు.

మానసోల్లాసము నీతఁడు రచించెనో లేదో అందలివిషయ మేదియో తెలియదు. భూలోకమల్ల బిరుదాంచితుఁ డగు సర్వజ్ఞసోమేశ్వరుడను పశ్చిమచాళుక్య చక్రవర్తి అభిలషితార్థచింతామణి యను నామాంతరముగల మానసోల్లాస మను సంస్కృత గ్రంథమును రచియించెనందురు. శ్రీనాథుఁడు దీని నాంధ్రీకరించె నేమో!

—:o:—

# 64. వినుకొండ వల్లభరాయలు

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; కామకాయనస విశ్వామిత్రగోత్రుఁడు; త్రిపురాంతకచందమాంబలకుఁ బుత్రుఁడు. ఇతనితండ్రి ఋగ్వేదమును సాంతముగాఁ బఠించిన వేదవిదుఁడు. భైరవ మంత్రోపాసకుఁడు.

ఈకవి దాదాపుమూడువందలగద్యపద్యములుగల క్రీడాభిరామ మను వీధినాటకమును రచియించెను. ఇందుఁ దననుగూర్చి కవియిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. మూఁడు గ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాఁట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వతశ్రీ వరించెఁ
గామకాయనస విశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె

సెవ్వఁ డా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్న భండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చంద్రమాంబికకు సుతుండు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు. ౨౨

ఈపద్యమందలి విశేషణములన్నియు వల్లభామాత్యుని తండ్రి యైన తిప్పనకు వర్తించును. ఈవిశేషణములు వల్లభరాయలకు వర్తించునని కొందఱభిప్రాయపడిరి. కాని నాకట్లుతోచుటలేదు. ఆ తిప్పన (త్రిపురాంతకుఁడు.) రాయలయొక్క రత్నభాండారరక్షకుఁ డైనట్లు పైపద్యములో నున్నది. ఆరాయ లెవ్వరో యందు లేదు కానియతఁడు హరిహరరాయ లైనట్లును, తిప్పనతండ్రి మల్లికారునుఁ డైనట్లును, ఈతిప్పన వినుకొండదుర్గమునకు మహాప్రధాని యైనట్లును, ఈక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. సత్యవ్రతాచార సత్కీర్తిగరిమలఁ
జంద్రుతోడను హరిశ్చంద్రుతోడ
నభిమానవిస్ఫూర్తి నైశ్వర్యమహిమల
రారాజుతోడ రేరాజుతోడ
సౌభాగ్యవైభవ జ్ఞానసంపన్నత
మారుతోడ సనత్కుమారుతోడ
లాలిత్యనిరుపమశ్లాఘావిభూతుల
భద్రుతోడను రామభద్రుతోడ
సాటి యనఁ దగు ధారుణీపాలసభల
వీరహరిహరరాయ పృథ్వీకళత్ర
రత్నభండారసాధికారప్రగల్భు
మల్లికార్జును త్రిపురారిమంత్రివరుని ౧౭

ఉ. గంధవతీప్రతీరపురఘస్మరపాదబిసప్రసూనపు
ష్పంధయచక్రవర్తి శుభితపరంతదుర ఘన్నా స్థానగా

ద్గంధగజంబు తిప్పన యఖండితధీనిధి కాంచెఁ బుత్రులన్
బాంధవకల్పవృక్షముల బైచన వల్లభ తిప్ప మంత్రులన్. ౨౦
(శ్రీపర్వత మనఁగా వినుకొండ)

కవికిఁ దాతకుఁ దాత యైన చంద్రామాత్యుఁడు కర్ణాటక దేశపురాజగు పెద్దబుక్కరాయలయొద్ద మంత్రిగానున్న ట్లీక్రింది పద్యములవలన నెఱుఁగ నగుచున్నది

శా. ఆమంత్రీశ్వరుకూర్మినందనుఁడు చంద్రామాత్యుఁ డంభోజభూ
భామారత్నపయోధరద్వయ తటప్రాలంబనైపథ్య ము
క్తామాణిక్యనిభాభిరూప్యపదవాక్యప్రౌఢసాహిత్య వి
ద్యామాహాత్మ్య విలాసముద్రిత విద్వన్మానసుం డిద్ధరన్. ౮

శా. కర్ణాటక్షితినాథుఁ డైన పెదబుక్కక్ష్మాపదేవేంద్రున
భ్యర్ణామాత్యుని దానఖేచరునిఁ జంద్రాధీశు బంధుప్రియున్
వర్ణించున్ గవికోటి శంకరజటావాటీతటాంతర్నదత్
స్వర్ణద్యంబుతరంగరింగణల సత్సాహిత్యసౌహిత్యయై. ౫

కవికిఁ బెదతండ్రి యైనలింగనమంత్రికూడ హరిహరరాయల యొద్ద మంత్రిగానున్న ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. కనకాద్రి ప్రతిమానధైర్యనిధి లింగక్ష్మాప మంత్రీంద్రుతో
ననతారాతి నృపాలమంత్రిజనతాహంకార తారాహిమా
ర్కునితో రూపరవీంద్రుతో హరిహరక్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో సాటి సమాన మీఁడు గలరా రాజన్యసైన్యాధిపుల్. ౧౮

చంద్రామాత్యుని మంత్రిగాఁ జేపట్టినబుక్కరాయలు సంగమ రాయలమూఁడవకుమారుఁ డైనబుక్కరాయలనియు, లింగనమంత్రిని జేపట్టినహరిహరరాయలు మొదటిహరిహరరాయలనియుఁ గొందఱి యభిప్రాయము. బుక్కరాయలు సంగమరాయని తండ్రి బుక్కరాయ లనియు హరిహరరాయలు రెండవ హరిహరరాయలనియు నాయుద్దేశము. ఈవిభేదము సులభముగాఁ దెలియుటకై రెండువంశవృక్షముల నీక్రిందనిచ్చుచున్నాఁడను. ఈవిమర్శనము కవికాలనిర్ణయమున కవసరమగుచున్నది. పెదబుక్కరాయలనఁగా మొదటి బుక్కరాయల కగ్రజుఁడైన హరిహరరాయలే యనువాదముకూడఁ గలదు.



వినుకొండ వారి వంశము.
చందామాత్యుఁడు
మంచెన్న




సింగన
తిప్పన
మల్లన
చెన్నమంత్రి
వల్లభ
లింగన హరిహర రాయలు మంత్రి
తిప్పన హరిహర రాయలు రత్నభాండాగారాధిపతి
సంగన
భైరవ
వల్లభామాత్యుఁడుకవి.




సంగమవంశము.
బుక్కరాయలు.
సంగమరాయలు
మొదటి హరి హరరాయలు ౧౩౩౬_౧౩౪౪
కంపరాయలు




బుక్కరాయలు (మొదటి) ౧౩౪౩_౧౩౭౯
మారప్ప
ముద్దప్ప
రెండవ హరిహరరాయలు (౧౩౭౯-౧౩౯౯)
రెండవ కంపరాయలు (౧౩౬౮-౧౩౭౪)
ఇంకను ౫ గురు
రెండవ బుక్కరాయలు (౧౩౯౯_౧౪౦౬)
విరూపాక్షు
మొదటి దేవరాయలు (౧౪౦౬_౧౪౧౩)
చిక్కరాయలు

ఈవంశవృత్తమునుబట్టి చంద్రామాత్యుని మంత్రిగాఁ జేకొనినవాఁడు సంగమరాయుల తండ్రియైన బుక్కరాయలేకాని సంగమరాయల కుమారుఁడైన బుక్కరాయలు కాఁడనియు, లింగన, తిప్పనలు రెండవ హరిహరరాయలయొద్దనే యుండిరనియు, స్పష్టమగుచున్నది.

సంగమరాయల కుమారుఁడైన బుక్కరాయలయొద్దఁ జంద్రామాత్యుఁడు మంత్రియయ్యేనేని, ఆయన మునిమనుమఁడైన లింగన బుక్కరాయలకుమారుఁడైన రెండవహరిహరరాయలయొద్దమంత్రిగానుండుట యసంభవము. అందుచేఁ జంద్రామాత్యుఁడు సంగమరాయల తండ్రియైన బుక్కరాయలయొద్దనే మంత్రిగానుండినట్లు నిశ్చయింపఁ దగియున్నది. అయితే, ఆబుక్కరాయలకాలము నాఁటికిఁ గర్ణాటరాజ్యము సంగమవంశీయులలో లేదు. ఆతనికాలము క్రీ. శ. ౧౨౭౦-౧౩౨౦ ప్రాంతమగును. అప్పుడుకర్ణాటరాజ్యముకాకతీయుల వశమందున్నది. ఆపక్షములో పెద్దబుక్కరాయలు గర్ణాటక్షితినాథుఁ డెట్లగునని సంశయము కలుగవచ్చును. కాకతీయులవలనఁగాని ఆకాలమునఁ గర్ణాటకదేశమును బరిపాలించుచున్న మఱియేప్రభువుల వలనఁ గాని యీబుక్కరాయలు కర్ణాటరాజ్య రక్షణమున నియోగింపఁబడియుండునని తలంపవలసియున్నది. తనతండ్రి, పెదతండ్రులు కర్ణాటప్రభువులయొద్ద మంత్రులుగానుండుటచేఁ దనపూర్వుఁడైన చంద్రామాత్యుఁడు కర్ణాటప్రభువుల మూలపురుషుఁడైన బుక్కరాయల మంత్రియని కవిచెప్పియుండును ఈబుక్కరాయలమనుమఁడైన మొదటి హరిహరరాయలయొద్ద జంద్రామాత్యుని మునిమనుమఁడైన లింగన మంత్రిగానుండుటకూడ నసంభవమే. కావున లింగన తిప్పనలు మంత్రులుగానున్న యాతఁడు రెండవహరిహరరాయలే కాని మొదటిహరిహరరాయలుకాఁడు. ఈకవినివాసముగా నెన్నఁబడుచున్న గ్రామము మోపూరు. నెల్లూరిమండలములో వెంకటగిరి తాలూకాయందు మోపూరున్నది. కాని యది ములికినాఁటిలోనిది కాదు.

ములికినాఁడు కడపమండలము. నెల్లూరుమండలము పాకనాఁడు. ములికి నాఁడును ముఱికినాడని కొందఱందురు కాని యది నిజమైనపాఠము కాదు. ములికినాఁ డనుటయే మంచిది. కొన్నిశాసనములలో దీనిని ముక్తనాఁడని కూడ వ్రాసియున్నారు. కడపమండలమునందలి పులి వెందల తాలూకాలో మోపూరున్నది. అచ్చట నొకపర్వతగుహా యందు భైరవేశ్వరాలయమున్నదనియు, నాతడే కవికి ష్టదైవమనియు నాతఁడురచించిన క్రీడాభిరామనాటకాంతమున.

చ. ముదమున ముల్కినాటిఁ బురమోహనశైలసువర్ణకందరా
సదనుఁడు కాలభైరవుఁడు శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ గృపసేయుఁగ వీంద్రకాంక్షిత
త్రిదశమహీరుహాంబునకుఁ దిప్పయవల్లభరాయమంత్రికిన్.

అను పద్యములో నుదాహరించినాఁడనియుఁ జెప్పుచున్నారు. మోపూరుకడ మోహనాచలమున్నదనియుఁ దానిపై భైరవేశ్వరాలయ మున్నదనియు A R 516 of 1906 శాసనమువలనఁ దెలియుచున్నది. ఆకాలమున మోపూరు గొప్పపట్టణముగా నుండి గొప్పవర్తకస్థాన ముగా నుండెడిదఁట. కాని వల్లభరాయని నివాస మాగ్రామము కాదని తోఁచుచున్నది క్రీడాభిరామమునఁ బైపద్యమునకుఁ బూర్వ మున నేయున్న:—

క. నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుకొండమహా
పుటభేదన మీత్రితయము
విటఁగూర్చెను బ్రహ్మ రసికు లెల్లరు మెచ్చన్.

అను పద్యమునుబట్టి యీకవినివాసము వినుకొండ యని నిశ్చ యింపవలసియున్నది. ఈగ్రంథమురావిపాటితిప్పురాంతకునిచేరచింపఁ బడిన ప్రేమాభిరామనాటకమున కాంధ్రీకరణముగాని స్వతంత్ర

గ్రంథముగాదనియు నందుచే నిందుదాహృతమైన వినుకొండ త్రిపు రాంతకుని నివాసమగునుగాని వల్లభరాయని నివాసముకాదనియుఁ ద్రిపురాంతకుఁడు "సరిచేసైరిపుడేలభాస్కరులు" అను పద్యములో "వినుకొండన్ రామయామాత్యభాస్కరుఁడో" యని తననివాస గ్రామమును దలపెట్టినాఁడనియుఁ గొందఱనుచున్నారు. కానియా యూహయందు సత్యములేదు-రావిపాటి త్రిపురాంతకుని నివాసము త్రిపురాంతకమే గాని వినుకొండకాదు.

వల్లభామాత్యకవినివాసము వినుకొండ. ఆగ్రామమునుబట్టియే ఆతనియింటి పేరువచ్చినది. ఆతనితండ్రి యగుతిప్పన వినుకొండదుర్గ మునఁ బ్రధానిగా హరిహరరాయల కాలములోనున్నట్లు పైనవ్రాసిన పద్యములోఁ జెప్పఁబడియున్నది. చంద్రామాత్యునికాలములో వీరి నివాసము మోపూరైననై యుండును. అచ్చట నున్న భైరవేశ్వ రుఁడు వీరికులదైవమైననై యుండును. మొదటిబుక్కరాయలు విజయనగరసింహాసన మధిష్ఠించియుండఁగా నాతనితనయుఁడైన రెండవహరిహరరాయలు ఉదయగిరి వినుకొండదుర్గముల పరిపాలనము నకై నెల్లూరుమండలమునకు వచ్చియున్నప్పు డాతనితోఁగూడ లింగన తిప్పనలిచ్చటకువచ్చి వినుకొండదుర్గాధిపత్యము వహించి యిచ్చట నివాసమేర్పరచుకొని యుందురు. అట్లుండియుఁ దమపూర్వనివాస మును దమకు 'మిరాసీ' గ్రామమునైన మోపూరుతో సంబంధ మును విడనాడక యచ్చటిభైరవస్వామినే యిష్టదైవతముగా నారా ధించుచునుండి యుందురు ఈకవిరచించిన క్రీడాభిరామము శ్రీనాథ కృతమనియు నీవల్లభామాత్యుఁడు ప్రణీతకవియనియు నొకవాదుక యున్నది. అందుచే నీకవి శ్రీనాథునికాలమువాఁ డనియు, వినుకొండ నివాసియనియుఁ దలంపవచ్చును. వినుకొండ పాకనాఁటిలోనిది. శ్రీనాథుఁడును బాకనాఁటివాఁడు.

వల్లభామాత్యకవి సంస్కృతములో రావిపాటి త్రిపురాంతకుఁడు రచించిన ప్రేమాభిరామము ననుసరించి రచించితిననియు, నాత్రిపురాంతకుఁడు సామాన్యకవిగాక నన్నయతిక్కనాదులతో సమానుఁ డనియు నటీసూత్రధార సంభాషణమున నిట్లు చెప్పియున్నాఁడు.

వ. "ఆమంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతక దేవుం డను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుబాస రచియించినవాఁడు.

గీ. ఆతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ
మనఁగ నెంతటియది దాని ననుసరించి
వీధియనురూపకము మది వెఱపు లేక
తిప్పవిభు వల్లభుండెట్లు తెనుఁగుఁ జేసె.

వ. అని యానతిచ్చెద రేని,

ఉ. నన్నయభట్టతిక్కకవినాయకులన్న హుళక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూడియమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
సెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని; రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ; తగునా యిటు దోసపుమాటలాడఁగన్.

ఈనాటకమునందు గోవిందమంచనశర్మ యను కౌసలనాటి బ్రాహ్మణుఁడును, టిట్టిభశెట్టియను వైశ్యుఁడును రెండుపాత్రములు. ఓరుగల్లురంగస్థలము. శృంగారహాస్యరసములు ప్రధానములు. ఓరుగల్లు పట్టణమందలి స్త్రీలచక్కదనములును, జారత్వవిశేషములును పచ్చి శృంగారముతో నిందు వర్ణింపఁబడినవి. బాలురు, యువకులు, యువతులు దుర్బలహృదయులైనవారీగ్రంథమును జదువరాదు. పండితులైనను గొన్నిపద్యములు దమలోఁ దాము చదువుకొనదగినవేకాని సభలోఁ గూర్చుండి పఠింపయోగ్యమయినవి కావు.

ఈగ్రంథమును వల్లభరాయఁడు రచింపలే దనియు, శ్రీనాథ మహాకవిరచియించి యాతనిపేరుపెట్టెననియుఁ బ్రతీతికలదు. బ్ర. శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారును వేటూరి విశ్వనాథశర్మగారును వీరేశ లింగముపంతులుగారును మఱికొందఱును ఈనాటకము శ్రీనాథకృతము కాదనియు వల్లభరాయఁడే దీనినిరచియించెననియు నిర్ధారణమొనర్చి యున్నారు. మానవల్లి రామకృష్ణకవిగా రీగ్రంథము నొకసారిముద్రించి యున్నారు. శృంగారగ్రంథమాలవారధికమూల్యము నేర్పరచి సామాన్యప్రజ కందకుండునటుల తక్కువప్రతులను ముద్రింపించుచు వేఱొక ముద్రితప్రతిని ప్రకటించినారు. దాదాపు ౯౦ పేజీలుగలయీముద్రిత ప్రతికిఁ గేవలము సత్యాన్వేషణమే మనసునందుంచుకొని శ్రీప్రభాకర శాస్త్రిలువారు గ్రంథములోనివాసికంటె నెక్కువ యసభ్యములుగా నున్న మఱికొన్నిపచ్చిశృంగారపు పద్యముల నుదాహరణముకొఱకందుఁ జేర్పుటకైన నంగీకరించి నూటముప్పదిపుటలపీఠికను రచియించి తుద కీగ్రంథము వల్లభరాయకృతముగాదనియు ముమ్మాటికిని శ్రీనాథకృత మేయనియు ఘంటాపథముగవక్కాణించియున్నారు. శ్రీ కే. రాఘవా చార్యులుగారు మొదలగుకొందఱుశ్రీశాస్త్రిగారియూహనంగీకరించిరి. పోల్చిచూచుటకు వల్లభరాయకవి రచించినమఱియొకగ్రంథము లేదు. ఈవీథినాటకములోని పద్యములు శ్రీనాథునికవితాశైలిని గలిగియున్న మాట వాస్తవము. శ్రీ శాస్త్రిలువారి పీఠికను జదివినపిమ్మటనియ్యది శ్రీనాథకృతమని యెట్టివారుననకమానరు. ఇందలిసత్యాసత్య నిర్ణయమున కావిషయములను బాఠకలోకము నెదుటనుంచవలయు ననినచో నసభ్యములైన యాగ్రంథమునందలి పద్యములను నట్టివే మఱికొన్ని పద్యములను మరల నిందు వ్రాయవలసినవాఁడ నగుదునని యాపనికిఁ బూనుకొనలేదు. ఇంతకును నందువలన నయ్యెడు ప్రయోజనములేదు. శైలినిబట్టియుఁ బ్రయోగములనుబట్టియు నీయంశమును నిర్ధారణ మొనర్పనిశ్చయించుకొన్నచో నీగ్రంథము శ్రీనాథకృతమని చెప్పక

తప్పదు. లక్షణ వేత్తలలోఁ గొందఱది వల్లభరాయకృతమనియుఁ గొందఱు శ్రీనాథకృతమనియుఁ దమతమ గ్రంథములలో నుదాహరించియున్నారు. వారి యుదాహరణము లీ వివాదమును బరిష్కరించుటకుఁ దోడుపడవు.

రావిపాటి త్రిపురాంతకుని సంస్కృతప్రేమాభిరామ మిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు. అందుచే నీగ్రంథకర్త మూలము నెంతవఱ కనుసరించెనో, ఎంతవఱకు స్వేచ్ఛను గైకొనెనో చెప్పుటకువీలు లేదు. కీ. శే. తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు త్రిపురాంతకుని ప్రేమాభిరామముకూడ నాంధ్రభాషలోనిదే యనియు, దానిననుసరించి వల్లభామాత్యుఁ డీరూపకమును రచించియుండుననియు వ్రాసియున్నారు. కాని యది యంగీకరింపఁదగినది కాదు. పైన వ్రాసిన వచనములో "ప్రేమాభిరామ నాటకంబుననుసరించి క్రీడాభిరామంబనురూపకంబు తెనుంగుభాసరచించినవాఁడు" అనియున్నది. ప్రేమాభిరామముకూడఁ దెలుఁగులోనున్నచో "తెనుంగుబాస రచయించినవాఁడు" అని చెప్పియుండడు. అది సంస్కృతంబులో నున్నదిగనుకనే యిది తెలుఁగులో రచియించెనని చెప్పవలసివచ్చినది.

ఈరూపకము శ్రీనాథకృతమే యైనచో నెప్పుడు రచియించియుండును? అనువిషయమునఁ బండితులు భిన్నాభిప్రాయులుగానున్నారు. భీమేశ్వరపురాణ రచనానంతరమున క్రీ. శ. ౧౪౩౫ ప్రాంతమున నీగ్రంథమును రచియించెనని కొందఱిమతము. వారు క్రీడాభిరామములోని:—

"గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్యమరయంగ విష్ణుమతము"

అనుపద్యమునందలి మూఁడుపాదములు భీమేశ్వరపురాణమున

"గార్గ్యసిద్ధాంతమత మునఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మత మగు"

అనుపద్యములో నున్నవనియు నీపద్యార్థద్యోతకశ్లోకము సంస్కృతభీమఖండమునఁ గలదనియు, నందుచే భీమపురాణము నాంధ్రీకరించిన పిదపఁ గ్రీడాభిరామమున నాపద్యమే యించుకమార్పుతోఁ జేర్చెననియుఁ జెప్పుచు నిట్టివే మఱికొన్ని యుదాహరణములనిచ్చి తమవాదమును సమర్థించియున్నారు. బహుపురాణవేత్త యగుశ్రీనాథుఁడు అంతకుఁ బూర్వము భీమేశ్వరపురాణమును జదువలేదనితలంపరాదు అందలిశ్లోకము నాంధ్రీకరించి ముందుగఁ గ్రీడాభిరామమునఁ జేర్చియుండెనని తలంచినను నందు విరుద్ధములేదు. క్రీ శ. ౧౪౩౫ నాఁటికి శ్రీనాథుఁడును వల్లభరాయఁడును వయసు చెల్లినవారుగా నున్నారు. ఆకాలమున నిట్టిశృంగారకావ్యరచనాసక్తులై రనియనుట కంటె శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసినట్లు క్రీ. శ. ౧౪౨౦ ప్రాంతమున నీకావ్యమురచితమైన దనితలంచుటయే సమంజసమని నాయభిప్రాయము. పెదకోమటివేమారెడ్డి కాలధర్మమునందిన పిమ్మట వల్లభరాయలను జూచుటకై శ్రీనాథుఁడు వినుకొండ కేఁగి యుండవచ్చును. ఆకాలమున నీక్రీడాభిరామమును శ్రీనాథుఁడు రచియించి యుండవచ్చును. కేవలము శ్రీనాథుఁ డీపుస్తకమును బూర్తిగ రచియింపలే దనియుఁ వల్లభరాయలు వ్రాయుచుండఁగా నాతఁడుతోడు పడియుండుననియుఁ గొంద ఱనుచున్నారు. కానిండు. కొంతయైన నేమి, అంతయునైననేమి శ్రీనాథున కిందు సంబంధమున్నది. భావములు ప్రేమాభిరామములోనివి. శ్రీనాథునకున్న సంబంధమెంతపరిమితిగలదో యెవరును జెప్పఁజాలరు. ఇందు విశేషభాగము శ్రీనాథవిరచితమనియే నాయభిప్రాయము.

క్రీడాభిరామకవిత్వము ధారాశుద్ధిగలిగి చక్కఁగా నున్నదని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు.

శైలి తెలియుటకై పచ్చివర్ణనములేని పద్యములఁ గొన్నిటి నీక్రింద నిచ్చుచున్నాఁడను.

సీ. హా! కుమారస్వామియాపవాహ్యములార!
హా! మంత్రదేవతాస్వాములార!
హా! కాలవిజ్ఞానపాకకోవిదులార!
హా! భూతభుక్తికుంభార్హులార!
హా! యహల్యాజార యతనహేతువులార!
హా! బలాత్కార కామాంధులార!
హా! నిరంకుశమహాహంకారనిధులార!
హా! కామవిజయకాహళములార!
హా! ఖగేంద్రంబులార! కయ్యమున నీల్గి
పోవుచున్నారె! దేవతాభువనమునకు
మీరురంభాతిలోత్తమా మేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార!

శా. స్థూలద్వ్యాత్రిపటావకుంఠనములున్ ధూపోపచారంబులుం
గాలాగుర్వనులేపనంబులు వధూగాఢోపగూహంబులుం
గేలీగర్భనికేతనంబులును గల్గెం గాక లేకున్ననీ
ప్రాలేయాగమ మివ్విధంబున భరింపన్ వచ్చురా టిట్టిభా?

మ. అదె మాణిక్యపుఁబూర్ణకుంభము వయస్యా! కార్యసంసిద్ధికై
మొదలం దోఁచినయట్టి మంచిశకునంబుంగా విచారింపరా
యుదయం బయ్యెడు భానుబింబము దిశావ్యోమావకాశంబులం
బదియార్వన్నె పసిండితీఁగలగతిన్ బ్రాఁకెం బ్రభాజాలముల్.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోధుమపిండి వంటయున్
గుప్పెడుపంచదారయును క్రొత్తగఁగాచినయాలనేయి పెస

ర్పప్పును గొమ్మునల్లనఁటిపండ్లును నాలుగునై దునంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణ వర్షులయింట రూకకున్.

చ. వెనుకకు మొగ్గవ్రాలి కడువిన్ననువొప్పఁగఁ దొట్టినీళ్ళలో
మునిఁగి తదంతరస్థమగు ముంగర ముక్కునఁ గ్రుచ్చుకొంచు తే
చెను రసనాప్రవాళమున శీఘ్రమ గుచ్చెను నల్లపూస పై
రనుపమలీల నిప్పడు చుపాయము లిట్టివి యెట్లునేర్చెనో!

సీ. అలకాపురంబున నంగారవర్మునిఁడన్
గంధర్వపతికన్య కమలపాణి
యాదివ్యగంధర్వకపరావతారంబు
మధుమావ తోగ్గంటి మండలమున
నాసుందరాంగి దక్షారామమునఁ బుట్టు
భువనమోహిని చిన్నిపోతి యనఁగ
నట్టిసత్ స్త్రీజాతి యాసానిపూఁతురు
చిరకాలమున సదాశివునిఁగూడి
పావనంబైన తమిలేటి పరిసరమున
వేఁగికురువాటికాదేశ విపినభూమిఁ
గోపులను పేరి చెంచుకులమునందుఁ
గడిమిగత్తుల యమ్మినాఁ గలుగఁగలదు.



## 65. నిశ్శంక కొమ్మన్న

ఈకవి శ్రీనాథునితో సమకాలికుఁడు. ఇతఁడు శివలీలావిలాస మను నొకపద్యకావ్యమును రచియించెను. ఇది రెండాశ్వాసములు మాత్రమే లభించినది. దాని నాంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రక టించుచున్నారు. ఆశ్వాసాంతమందలిగద్య యిట్లున్నది.

"ఇది శ్రీమదష్టభాషాకవితాప్రవీణబుధజనస్తుత్యనిశ్శంకకొమ్మ నామాత్య ప్రణీతం బైన శివలీలావిలాసంబు"

లభించినభాగమునుబట్టి కవినిగూర్చి యింక నేమియుఁ దెలియ రాలేదు అమాత్యశబ్ద ముపయోగించుటచే నీతఁడు నియోగిబ్రా హ్మణుఁ డనుటకు సందియములేదు. గోత్రమేదియో తెలియ రాలేదు. కవి గోదావరిమండలమువాఁ డనుటనిశ్చయము. గోదావరిమండల మున నమలాపురము తాలూకాలోని పోలవరము గ్రామమున నియోగి బ్రాహ్మణులు నిశ్శంకలవా రున్నారు. వారిది శ్రీవత్సగోత్రము. గోదావరిమండలమునందే యింకనొకపోలవరమున్నది. ఇది వీరభద్రే శ్వరుసకునికిపట్టగు పట్టిసక్షేత్రమున కనతిదూరముననున్నది. ఈక్షేత్ర మే ఘోడెరాయాంకుఁడును, వీరభద్రారెడ్డికి గురువునగు భీమగురుని నివాసము. ఈభీమగురువును నీకవి శివలీలావిలాసమున మూఁడుపద్య ములలో వర్ణించియున్నాఁడు. బహుశః యీభీమగురుఁడు కవికిఁగూడ గురువై యుండును.

ఈ పోలవరమునందున్న యొకశాసనములో నిశ్శంకకామయ్య పేరు మహానందీశ్వరస్వామియాలయమునకు ధర్మకర్తయని యుదా హృతమై యున్నది. ఆశాసనము శా. శ. ౧౩౩౦ నాఁటిది. ఈకవి కిని నాకామయకును సన్నిహిత సంబంధముండియుండును. (A. R. 293 of 1920) దీనినిబట్టికవి యీపోలవర నివాసియని చెప్పనొప్పును.

నిశ్శంకకొమ్మన్న వీరమహేశ్వరములోనివనిప్రబంధరత్నావళి లోఁ గొన్నిపద్యము లుదాహృతములైనవి. శివలీలా విలాసమునకువీర

మాహేశ్వరము నామాంతరమో కాక యది వేఱుగ్రంథమో తెలియదు. శివలీలావిలాసమందలి మొదటి రెండాశ్వాసములలోని పద్యమొకటియుఁ బ్రబంధరత్నావళియం దుదాహృతములైన పద్యములలోఁ గాన్పింపక పోవుటచే నది వేఱుగ్రంథమని యెంచి వీరమాహేశ్వరమునందలి పద్యములను, నీతని శైలి తెలియుటకై శివలీలావిలాసమునుండి కొన్ని పద్యములను నీక్రింద వ్రాయుచున్నాఁడను.

వీరమాహేశ్వరము:—

సీ. పులినంబు తోలుచూలు పుండరీకాక్షుని
యవతారభేదంబు కవులరాజు
బహుపురాణగ్రంథ భారతసంహితా
పరిగుంభనక్రియాపండితుండు
కల్తివన్నియవాఁడు కౌరవాన్వయకర్త
శ్రుతులేర్పరించినసూత్రధారి
సిద్ధనీవారముష్టింపచాధ్యక్షుండు
శుకునికూరిమితండ్రి సకలవేది

గీ. కాళికేయుండు యోజనగంధిపట్టి
తత్త్వనిర్ణేత ఘనతపోధర్మరాశి
నైమిశారణ్యమునిసభాభూమి కెలమి
నేఁగె నొకనాఁడు వ్యాసమునీశ్వరుండు.

సీ. ప్రణవపీఠిక నెక్కి భాసిల్లు నేదేవి
యామ్నాయహేమహర్మ్యాగ్రవీథిఁ!
జరియించు నేదేవి సహజారుణజ్యోతి
రానందమూర్తి యై బ్రహ్మనాడి!
నేదేవి తనయిల్లు నిచ్ఛాక్రియాజ్ఞాన
[illegible]

తోడునీడయుఁ బోలెఁ దులకించు నేదేవి
యెల్లకాలంబు విశ్వేశుఁగూడి?

గీ. యట్టిదేవి జగన్మాత యఖిలవంద్య
నిఖిలవిద్యైకశేశ్వరి నిత్యమహిమ
నొకటియును శ్రీగళుని క్రేవ నుల్లసిల్లు
నలఘుకల్యాణశుభగాత్రి యద్రిపుత్రి.

సీ. కల్పాంతవార్థి మోఁకాలిబంటిగ నేయ
తీశ్వరుఁ డొంటిమైఁ దిరిగినాఁడు?
వటపత్రవీథి నెక్కటియున్న బాలు నే
తాపసాధిపుఁడు ముద్దాడినాఁడు?
తనపేర నేతపోధనమౌళి సుస్థిర
స్థితిఁ బురాణంబు సంధించినాఁడు?
హరుని మెప్పించి సంహారకాలుని జయో
న్మాద మేమునిరాజు మాన్చినాఁడు?

గీ. కనియె నటువంటి సంయమీంద్రుని మహాత్ముఁ
దనయునిఁగ నమ్మృకండుని ధర్మపత్ని
సహజశివభక్తిరతుని విశ్వప్రసిద్ధు
ననఘకీర్తి మార్కండేయుఁ డనెడువాని.

సీ. ఎనిమిదిరూపంబు లేకమై కనుపట్టి
దీపించు నెవ్వానిదివ్యమూర్తి?
గణుతింపఁదగు దేవగణముల యాఁకలి
వెసఁదీర్చు నెవ్వాని నొసలికన్ను?
రాజసంబునఁ జొరరానిచోటులు సొచ్చి
వడి మేయు నెవ్వానివాహనంబు
నాణెమై యఱువదినాల్గు పీఠములందు
రాణించు నెవ్వానిరాణివాసి?

గీ. మది గనుంగొని పాయరానట్టి మోహ
మిచ్చ నొదవించు నెవ్వానియిల్లు విల్లు?
బెరయు నెవ్వానిపలుకులు బేసియగుచు
నెందు నెవ్వాని సేవింతు రెల్లసురలు?

సీ. దైతేయకాంతలతలకుఁ గెమ్మోవుల
వీటికాశ్రీలకు వీడుకోలు
వేల్పుటిల్లాండ్ర క్రొవ్విదపుఁ జన్నులమీఁది
యలువుఁబయ్యెదలకు నిలువనీడ
విశ్వజగత్త్రయీవిజయలక్ష్మీగాథ
బిరుదోత్సవములకుఁ బెండ్లివిందు
పరిపంథివాహినీ పరిచితపరిభవ
ప్రాప్తిసంకటములఁ బాయుత్రోవ,

గీ. సేసి యెయ్యది విలసిల్లుఁ జిత్రమహిమ?
నద్ది ప్రయోగింప నెత్తైనయచ్యుతుండు
విలయసమయసముద్భూత విపులదహన
దారుణస్ఫూర్జనంబు సుదర్శనంబు.

సీ. తల్లిదండ్రులతోడి తగు లొల్లకుండియుఁ
దల్లితండ్రులతోడి తగులువలచి
కందర్పుమీఁది యక్కటికంబు సెల్లియుఁ
గందర్పుమీఁది యక్కటిక మొదవి
సంసారకేళిప్రసక్తిఁ బోఁదట్టియు
సంసారకేళిప్రసక్తి గలిగి
సగుణవిశేషయోజనము ఘటించియు,
సగుణవిశేషయోజనము మరగి

గీ. సగము పురుషుండు కంజాక్షి సగముగాఁగ
నరనారీశ్వరాకృతి ననువు పఱచి

హరుఁడు తల్లింగమధ్యంబునందు నుండి
హరివిరించుల కంతఁ బ్రత్యక్ష మయ్యె.

సీ. పులుగురాయఁడు తమ్మికొలఁకుల చెలికాని
బండిబోయనితోడి పాలివాఁడు
పన్నగస్త్రీలకుఁ బాలిండ్లపసవాస
మగడింప నోపినమగల మగఁడు
దంభోళికొక యీఁక తాఁకు కానిక చేసి
యమృతంబుఁ దెచ్చినయనఘుండు
వినతముద్దులపట్టి వనధిచెంగటబోయ
పగకు నాఁకలిగొన్న భవ్యబలుఁడు
పక్షములుదాల్చి వచ్చినపసిఁడికొండ
యట్టివిలసిల్లు మేటివాహనముగాఁగ
నడచె హతశేష దైవసైన్యములు దాను
నసురకులమర్దనుండు జనార్దనుండు.

శా. అజ్ఞాసిద్ధికరంబు ముక్తిదము చిత్తానందసంధాయి శై
వజ్ఞానాంకుర శిష్టబీజము ప్రభావప్రౌఢ సంచిత్కళా
జిజ్ఞాసావిభవప్రదాయకములక్ష్మీకారణంబార్జితో
పజ్ఞామూలము భక్తలోకమునకుం బంచాక్షరం బిమ్మహిన్.

సీ. కమలజాండంబులు కందుకంబులు చేసి
యొండొండ తాటింపనోపువారు
విలయవహ్నులఁబట్టి వెసదండలుగఁ గ్రుచ్చి
యురమున ధరియింపనోపువారు
తివిరిసంహారభైరవునైనఁ బాలివోవ
నొకమాత్ర వసిమాల్ప నోపువారు
కాలచక్రక్రియాఘటనంబు ద్రిప్పి యొం
డొకలాగు గావింపనోపువారు

ప్రమథవీరులు వివిధరూపములతోడ
హాసన• • • ... ...ద్యలఘుగతులు
వెలయఁ గోటానకోటులు గొలిచి వచ్చి
రతఁడు హరుఁ గొల్వనేతెంచు నవసరమున

సీ. కఱకుచీఁకటులమూఁకల నుగ్గునూచగ
నుఱిచి నూఱకత్రాగు నెఱతనంబు
పొట్టేటిరాయని బాళియుంబు గదలించి
వాహ్యాళి గదలెడివైభవంబు
క్రతుభాగములు తెచ్చి కైతప్పగాకుండ
వేల్పుల కందించు వెరవుసొంపు
మూఁడుమూర్తులుదాల్చి మురువుతోజన్నంపు
వేదిపైఁ గొలువుండు విభ్రమంబు
నీక చెల్లు నొరుల నీతోడిసాటికిఁ
బేరుగుచ్చి యెన్నలేరుజగతి
వశమె నిన్నుఁ బొగడ స్వాహావధూకుచా
భ్యన్నతప్రికాశ ! యోహుతాశ !

శివలీలావిలాసము:—

ఉ. శ్రీవిభుసెజ్జ మేదినికిఁ జెల్వగుపుట్టము దివ్యనవ్యర
త్నావలిమన్కిపట్టు దివిజారులదుర్గము వాహినీపతుల్
భావముగట్టుతావు బడబాజ్వలనంబున వంటయిల్లు నాఁ
గా విలసిల్లు నావనధిగాధమహత్వము చెప్ప నొప్పుగున్.

చ. వరయశుఁ డింకఁగల్గుఁ గురువంశమునన్ జనమేజయుండు, నా
బరఁగి పరీక్షితాత్మజుఁడు పాయక యాతఁడు సర్పయాగ ము
ద్ధుమశిఁ నప్పుడతిదుస్సహతద్దహనార్చులందు సో ?
దరహితపుత్రపౌత్రసహితంబుగ మ్రగ్గుఁ డు మీర లందఱున్.

ఉ. అశ్వముజాడఁగానక భయంపడి యాసగరాత్మనందనుల్
నిశ్వసనాహుతిన్ వదననీరజము ల్గమలంగ మొత్తమై
యాశ్వనురూపయానమున నక్కడ నక్కడ కేఁగి యేఁగి యీ
విశ్వవసుంధరాస్థితి గవేషణచేసిరి పెక్కుభంగులన్.

ఉ. తన్మదిరాక్షివిభ్రమము దక్కక కన్నులఁ గ్రోలఁ జొచ్చెఁ బే
మన్మరుచేత బిట్టదరి మానస మాకుల మయ్యె నిట్లు గ
న్నన్మనసున్ వశంబులయి నూల్కొనమిన్ బహిరంతరంబులన్
దన్మణిచెంగరం బజుఁడు దందడి వేడ్కలు సందడింపఁగన్.

చ. మఱఁ దలపోఁక దంపతులమర్మముల న్వెదళించి పాంథభీ
కరముగ నెత్తికట్టిన ప్రకాశము నొందెడువన్న లీల ని
ర్భరరుధిరాభిషేకపరిభాసితచక్రముఁ బోలె న త్తఱిన్
వరుణునిదిక్కునందు దినవాయకమండల మొప్పె శోణమై.

ఉ. ఆరవివంశవల్లభుఁడుద గ్రత నుర్వర యేలె నిర్మల
స్ఫారయశంబు దిక్కులకుఁ బాయని చందనచర్చగా మహో
దారనిరూఢి దీనులకు దీప్తనిధానముగా సముల్లస
ద్వీరగుణంబు శత్రులకు దేవపురీపథదర్శనంబుగన్.

ఉదాహృతపద్యములనుబట్టి కొన్మనకవిత్వము ప్రౌఢమై సమ సంస్కృతాంధ్రపదసంయుతమై యనర్గళధారకలిగినూతనభావములతో మనోహరముగ నున్నదని విదితమగుచున్నది.

వీరమాహేశ్వరము నెవరికిఁ గృతియిచ్చెనో తెలియదు. శివలీలా విలాసమును దొడ్డారెడ్డికి మనుమఁడును అల్లాడరెడ్డికిఁ గుమారుఁడును శ్రీనాథకవికృత కాశీఖండకృతిపతి యగు వీరభద్రారెడ్డికిఁ దమ్ముఁడును నగు దొడ్డారెడ్డికిఁ గృతియిచ్చెను. ఈదొడ్డారెడ్డిని గవి యీక్రింది సీసపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. పెద్దకోమటివేమపృథ్వీసు వెను సూచి
యతనిసంపదలెల్ల నపహరించి

కటకాధిపతిఁ గెల్చి గజపతిదళవిభా
ళాఖ్యానబిరుదంబు నలవరించె
ఒడ్డాదివిభుఁదోలి యొగివానియిండ్లెల్ల
పట్టులు ద్రవ్వించి బలువు చెఱిపె
ధారాసురత్రాణుఁబోరనిర్జితుఁ జేసి
కొల్లవట్టించెఁ దత్కూటములను
గెరలుచుండి తురగరేవంతుఁ డవఘళ
రాయమాన మగ్దనాయకాంక
దీప్యమాననిమ్నతి ప్రతాపవిహారి
దొడ్డవిభుని యల్లదొడ్డశౌరి.

శ్రీనాథమహాకవి కాశీఖండమున నీదొడ్డారెడ్డిని మూఁడుపద్యములలో వర్ణించియున్నాఁడు. అందలి మధ్యపద్యమిది: —

శా. ఔరా! అల్లయరెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతిఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోతగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్
కీరాంభోధితటంబున న్నిలిపె దిక్సీమాజయస్తంభముల్.

ఇందలి "అల్లయరెడ్డిదొడ్డ" యని విలేఖకులు ప్రమాదమున వ్రాసిరేమోయనియు "దొడ్డయరెడ్డియల్ల" యని యుండవలయు ననియు ననుమానింపఁ బడినది. కాని యీపద్యము దొడ్డయరెడ్డిని వర్ణించిన కాశీఖండమందలి పద్యములు మూఁటిలో మధ్యనుండుట చేతను అల్లాడరెడ్డికొను సోదరులతో గూడనుండి దొడ్డారెడ్డి, తన యవక్రపరాక్రమమును గనుపరచినవాఁ డగుటచేతను నీయనుమానము నకుఁ దావులేదు. కవులెవ రెందెట్లు వర్ణించినను, అల్లాడ, వేము, వీరభద్ర, దొడ్డారెడ్ల విజయములు మొత్తముమీఁద నందఱకును వర్తించుననియే చెప్పఁ దగియున్నది.

ఈదొడ్డారెడ్డి మిగులఁ బరాక్రమవంతుఁడు. ఇతఁడు గుఱ్ఱపు స్వారిచేయుటలో నారితేరినవాఁ డనియు నిరువదినాలుగు మూరల దూరమును గుఱ్ఱమును దాటించెనని శ్రీనాథుఁ డీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

"మ. హరిదాటించెఁ బురోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునం
దరుదే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం
డిరువైనాలుగుమూళ్ళమేర యదిపో లెక్కింపఁగా నేలయ
ద్ధరణీనాథునికీర్తిదాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్."

ఈవిషయమునే కొమ్మనామాత్యుఁడు శివలీలావిలాసమున:—

మ. అరరే యల్లయదొడ్డభూవిభుఁడు వాహారోహరేవంతుఁడిం
పరుదారన్వడి మూలగూరికడ వాహ్యాళిస్థలిన్ రాజకుం
జరసింహం బనువారువంబును యదృచ్ఛాలీలదాఁటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్ళనిడు పుత్తేకంబు చేయొత్తుగన్.

అనుపద్యములో వర్ణించియున్నాఁడు.

ఈకాలమునఁ గళింగరాజ్యమును బరిపాలించుచున్నవాఁడు కళింగగాంగవంశములోనివాఁడును గజపతియు నగుభానుదేవుఁడు. రాజమహేంద్రవరపు రెడ్డిరాజు లీభానుదేవునిజయించి తమరాజ్యమును మహానదివఱకును వ్యాపింపజేసిరి. ఈభానుదేవుని తరువాతఁ గళింగసింహాసనము నధిష్ఠించినవాఁడు కపిలేంద్రగజపతి ఇతఁడుభానుదేవుని మంత్రియని కొందఱును స్వయందత్తుఁ డనికొందఱు నను చున్నారు. ఈవిషయమునుగూర్చి మఱియొకతావున వ్రాసెదను.

శివలీలావిలాస కృతిపతియైన దొడ్డారెడ్డి, గుంపినియను గ్రామమును, అల్లయదొడ్డవరమని పేరుపెట్టి బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చెనని యొకశాసనముకలదు ఈతామ్రశాసనపుత్రేకులు గోదావరి మండలమందలి రామచంద్రపురముతాలూకాలోనికొంకుదురులోలభించుటచే దీనికి కొంకుదురుశాసన మనిపేరు వచ్చినది. దానమిచ్చిన గ్రామము ప్రస్తుతమురాజోలు తాలూకాలోనిది. ప్రతిగ్రహీతలలో

నెవ్వరో కొందరు నివాసముగాఁ జేసికొనియుందురు. దానమిచ్చిన గ్రామమునకుఁ జుట్టునున్న గ్రామములు పలివెల, దేవరపల్లి, ఈత కోట, కేతరాజుపల్లి, వెదిలేశ్వరం అని శాసనములలోఁ పేర్కొనఁ బడినవి. ఆగ్రామము లిప్పుడా పేరులతోనే వ్యవహృతము లగుచున్నవి. ఉత్తరమున "కొంతేయునది" యని యందున్నది. అది నది కాదు. కానియొకకోదువలెనున్నది. ఈదానప్రతిగ్రహీతలలో నిశ్శంక కొమ్మయామాత్యుఁడు లేఁడు కొండిన్యగోత్రుఁడగు కలంగర కొమ్మయామాత్యుని కుమారుఁడు మాచమంత్రియున్నాఁడు. కానియాతఁడీకవికుమారుఁడనుట కాధారములు లేవు. గుంపినియను గ్రామమిప్పుడు లేదు. కాని శాసనములలోఁ జెప్పఁబడిన పైగ్రామములనుబట్టిచూడఁగా గుంపినియుండవలసినతావున "గూళ్ళపాల" మనుపాలె మొకటి యున్నది. అచ్చట నొక పెద్దమాయియును పాడుపడిపోయిన దేవాలయ చిహ్నములును గలవు. ఈయాలయము శాసనమునం దుదాహృతమైన ప్రసన్నవల్లభాలయమును విష్ణ్వాలయమందురు. ఈశాసనమునందు బ్రహ్మనాగేశ్వరాలయ మను శివాలయముకూడనున్నది. అది యిప్పుడు దేవరపల్లి గ్రామప్రాంతమునం దున్నది. పైనవ్రాసిన గూళ్ళపాలమున నాదియాంధ్రులును సెట్టిబలిజీలును మాత్రమేకలరు. దీని కనతిదూరమున బ్రాహ్మణాగ్రహార మొకటి యుండెడిదనియు నది పాడుపడిపోయినదనియుఁ జెప్పుదురు.

"శివలీలావిలాసము ౧౪౩౫ సంవత్సరప్రాంతమునందు రచియింపఁబడియుండును. అందుచేత నిశ్శంక కొమ్మనామాత్యకవి ౧౪౩౦ సంవత్సరము మొదలుకొని ౧౪౭౦ సంవత్సర ప్రాంతము వఱకును గవియై యుండియుండును" అని శ్రీవీరేశలింగముపంతులు గారు కవులచరిత్రమున వ్రాసియున్నారు. అది సత్యమనుటకు సంశయింపఁబనిలేదు.

ఈకొమ్మనకవి, దొడ్డారెడ్డి కగ్రజుఁ డగునల్లాడ వేమారెడ్డిని ఈ గ్రంథమ్ములో వర్ణించియున్నాఁడు.

సీ. ఉక్తవేళల షోడశోపచారంబుల
శివునిచిత్తంబు రంజితముసేయుఁ
బ్రతివత్సరంబు నుద్భటవసంతోత్సవ
శ్రీలదిక్చయము వాసితముసేయు
దయతోడిచూపుల నయరీతినింబదా
నతనృపాబరఁబదోన్నతులఁజేయు
హేమాద్రిదానక్రియామహాత్మ్యంబున
విప్రుల నతిదశాన్వితులఁజేయు
ననిఁ గొనియాడఁదరముగా దతనిమహిమ
ప్రకట సింహాచలోత్తరభాగలిఖిత
వివిధజయశాసనాక్షరవిసరకరస
మిద్ధగుణుఁ డల్లవిభుసివేమేశ్వరుండు.

శ్రీ నిడదవోలు వేంకటరావుపంతులు M. A. గారీపద్యము నుదాహరించుచు రెడ్డిసంచికయందు "సింహాచలోత్తరభాగలిఖిత" మైన శాసనమిదియేయని యాశాసనమును బ్రకటించియున్నారు. ఆశాసనమంతయు నిట నప్రస్తుతము. దీనినిగూర్చి శ్రీనాథచారిత్రమునఁ గొంతవ్రాసియుంటిని. ఆశాసనకాలము శా. శ. ౧౩౫౬ (క్రీ. శ. ౧౪౩౪) శ్రావణశు౧౪ అల్లయవేమారెడ్డి శా. శ. ౧౩౫౬ శ్రావణ శు ౧౪-పుష్యనడుమఁజనిపోయియుండునని వ్రాసియుంటిని. శివలీలావిలాసములోని వర్ణనమునుబట్టి యప్పటికాతఁడు జీవించియున్నట్లు తోఁచుచున్నది. కావున నామధ్యకాలముననే దొడ్డారెడ్డికీకృతిప్రదానము జరిగియుండునని నిశ్చయింపఁ దగియున్నది.

శివలీలావిలాసమున నీశ్వరునిలీలలు ముప్పదియారు వర్ణితములయినట్లు గ్రంథాదిని కవిచెప్పిన వాక్యములవలనఁ దెలియుచున్నది. లభించిన రెండాశ్వాసములలోను పదకొండు లీలలున్నవి. ఇఁక నెంత

గ్రంథమున్నదియో తెలియరాదు. పండితారాధ్యచరిత్రమున సోమనాథకవి యిరువదియైదులీలలనే చెప్పియున్నాఁడు.

కృతిపతి యైనదొడ్డారెడ్డి యెప్పుడు చనిపోయెనో తెలియదు. క్రీ. శ. ౧౪౩౮ ప్రాంతమునఁ గర్ణాటరాజులతో జరిగినయుద్ధములో నాతఁడశువులఁ గోల్పోయెనని తోఁచుచున్నది.

## 66. భైరవకవి

ఇతఁడు శ్రీరంగమాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిరాజగజాంకుశము ననుమూఁడు గ్రంథములను రచియించెను. ఇందురత్నశాస్త్రమును శ్రీరంగమహాత్మ్యమును ముద్రితములైనవి. కవిరాజగజాంకుశము నందలి ౭౮ పద్యములుమాత్రము ముద్రితములైనవి. దీనిముద్రితప్రతులు (ఆంధ్రపరిషత్పత్రిక సం ౧౮.) శ్రీమానవల్లి రామకృష్ణకవిగారియొద్దను, మదరాసునందలి అడయారు పుస్తకభాండాగారముననుగలవని కవిగారు శ్రీరంగమాత్మ్య పీఠికలో వ్రాసియున్నారు. శ్రీరంగమాహాత్మ్యమునఁ గృతిపతి దనునుగూర్చి పలికినట్లు కవివ్రాసికొనినయీక్రిందిపద్యము వలనను, శ్రీరంగమాహాత్మ్యగద్యవలనను, ఇతఁడు గౌరనామాత్యుని తనయుఁ డనియు, గౌతమగోత్రుఁ డనియుఁ శ్రీభ్రమరాంబా ప్రసాదలబ్ధసిద్ధసారస్వతగౌరవుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. ఈభ్రమరాంబాప్రసాదము గౌరనకైన కావచ్చును.

మ. కృతవిద్యాఖురళీపరిశ్రమకళాకేళీవిలాసుం జన
స్తుతచారిత్రుని గౌతమాన్వయపవిత్రుం గౌరనామాత్యస
త్సుతుఁ గల్యాణకవిత్వలక్షణసమర్థున్ సూక్తిముక్తాఫలా
తతకాంతిస్ఫుటచంద్రికోల్లసితవిద్వత్కైరవున్ భైరవున్.

గద్యము:— ఇది శ్రీమద్భ్రమరాంబికావర ప్రసాద లబ్ధసిద్ధసారస్వత విలా
సగౌరవ గౌరనామాత్యపుత్త్ర సుధీవిధేయ భైరవ నామధేయప్రణీ
తం బైన శ్రీరంగమహాత్త్వం బనుపురాణకథ యందు...... 
రత్నపరీక్షయందుఁ దననుగూర్చి కవివ్రాసికొనిన పద్యము లివి:—

క. భ్రమరాంబాదేవికృపన్
సముచితనిరవద్యహృద్యసాహిత్యకళా
క్రమవిమలప్రతిభామణి
క్రమవైభవశాలియైన గౌరనసుతుఁడన్.

క. భైరవుఁడ నుభయవిద్యా
పారీణుఁడ లోభిభవనభవభూమ వ్యా
పారసవికారదుష్కర
ఘోరపిశాచము లదల్చుగుణభైరవుఁడన్.

కవినిగూర్చినవిశేషము లీతనిగ్రంథమునుండి యింక నేమియుఁ దెలియలేదు. ఈతఁడు రచించిన కవిరాజగజాంకుశము పూర్తిగానాకు లభ్యముకాలేదు. తంజావూరునందలి యముద్రిత గ్రంథభాండాగారమున కవిగజాంకుశముయొక్క యముద్రితప్రతియొకటి కలదని యాగ్రంథములపట్టికవలనఁ దెలియుచున్నది. గ్రంథకర్తనామ మీ క్రిందిపద్యములోఁ జెప్పఁబడియున్నది.

మ. గణవర్ణాదుల మేలు కీడు తెలియంగాఁజెప్ప సాహిత్యల
క్షణదీక్షాగురుఁ డైనగౌరనసుధీ * సంస్తుత్యుఁ డత్యుల్లస
ద్గుణరత్నాభరణుండు భైరవకవీంద్రుం డెందుఁ దజ్జ్ఞుల్ దనున్
బ్రణుతింపం గవితాగజాంకుశము భూప్రఖ్యాతిమై మించఁగన్.

ఇతఁడు తానదివఱకు రచించినగ్రంథములపేరుల నేగ్రంథము లోను జెప్పియుండలేదు. కాని శ్రీరంగమాహాత్మ్యములోని యాక్రింది పద్యమువలన గణవర్ణఫలములు కులములు మొదలగు నియమములను

* 'సంజాతు' అనియుండవలయును.

దెలుపులక్షణగ్రంథ మొకటి యీతనిచే రచియింపఁబడినట్లు సూచిత మగుచున్నది. రంగరాట్ఛందమునం దుదాహరింపఁబడిన కవిగజాంకు శముసందలిపద్యములలో నీలక్షణములు చెప్పఁబడియున్నవి.

సీ. శబ్దార్థరూఢి రసస్థితి బహువిధ
వ్యంగ్యభేదములు భావములు గతులు
శయ్య లలంకారసరణులు రీతులుఁ
బరిపాకములు దశప్రాణములును
వృత్తులు వస్తువివేకంబు గుణములుఁ
గవిసమయముఁ జమత్కారములును
వర్ణనంబులు గణవర్ణఫలంబులుఁ
దత్కాలంబులు నధిదైవతములు
గ్రహములును శతుమిత్రయోగములు దశలు
నంశవేధయు భూతబీజాంకురముల
పొత్తువులుఁ దెల్పి శాంతవిస్ఫురణ ననరు
సత్కవీంద్రుని కృతి బుధసభల వెలయు.

ఈకవి రచించినరత్నపరీక్ష యనుగ్రంథము ౮౦ పద్యములుగల యొకచిన్నకావ్యము. ఇందు నవరత్నముల లక్షణములు, వానిమంచి చెడ్డలు వానిపరీక్షావిధానము మొదలగువిషయములు వర్ణితములైనవి. ఈకావ్యము ముదిగొండ వీరేశ్వరునకుఁ గృతియిచ్చినట్లును, ముదిగొండ కేదారయ్యపుత్రుఁడైనవీరభద్రుఁడికోర్కెపయిని దానుపూర్వమగస్త్యమహర్షి చెప్పినదానిని గ్రోడీకరించి చెప్పినట్లును గవి యీ క్రిందిమూఁడుపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. శ్రీ వెలయఁగఁ బద్యములను
బావననవరత్నకుసుమపంక్తుల పూజల్
గావించెద ముదిగొండల
శ్రీ వీరేశ్వరున కు భ క్తిం[illegible]

క. ఆవీరేశ్వరు పేరిట
నావల కేదారపుత్త్రుఁ డని భక్తులు సం
భావింప నధికవిద్యా
ప్రావీణ్యుం డైన వీరభద్రుం డెలమిన్

క. తన్నుఁబ్రియమార వేఁడిన
మున్ను మునీంద్రుల కగస్త్యముని చెప్పినయా
సన్నుత మణిలక్షణములు
చెన్నుగఁ గ్రోడీకరించి చెప్పెదఁ దెలియన్.

ముదికొండ నైజాము రాష్ట్రములోనిది.

రత్నశాస్త్రమందలికవిత్వశైలి తెలియుటకై రెండుపద్యముల నుదాహరించెదను.

ఉ. నీరదముల్ దిగంతములు నిండి పటుస్ఫుటగర్జితంబులే
పార మహోగ్రవృష్టిగురియన్ బ్రభవించు నితాంతకాంతితో
నారయ కుక్కుటాండసమమై పడు ముత్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందు్ర వసుధన్ బడకుండగ నేర్పువెంపునన్.

ఉ. దాకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెట వేయ భిన్నమై
పోక జలంబులో మునిఁగిపోవక యెప్పుడు లోహపత్త్రికన్
జేకొని వ్రాయ రేఖ విలసిల్లనివజ్రము శుద్ధ మిద్ధర
న్బ్రకటరీతిఁ దాల్ప నట భర్గుఁ డొసంగు శుభంబు లెప్పుడున్.

ఇతఁడురచించిన శ్రీరంగమాహాత్మ్య మైదాశ్వాసములుకలది. ఇందు సుప్రసిద్ధవైష్ణవపుణ్యక్షేత్ర మగు శ్రీరంగముయొక్క మాహాత్మ్యము వర్ణితమయినది. ఈశ్రీరంగమాహాత్మ్యముగరుడపురాణమున నూఱధ్యాయములలోను బ్రహ్మాండపురాణమునఁ దొమ్మిదధ్యాయములలోను జెప్పబడియుండెను. కట్టా వరదరాజకవియును, ఈభైరవకవియును గరుడపురాణము ననుసరించి పద్యకావ్యములను వ్రాసియుండిరి. బ్రహ్మాండపురాణము నాధారముగాఁ జేసికొని ముకుందయోగి

ద్విపదకావ్యముగను, భాగవతులరామయకవి, గుంటుపల్లి జగన్నాథ కవి ప్రభృతులు పద్యకావ్యములుగను శ్రీరంగమాహాత్మ్యమును రచియించి యుండిరి. శ్రీరంగమాహాత్మ్య మాంధ్రవచనమునఁ గూడ గలదు.

భైరవకవి గరుడపురాణముననుసరించి యీ గ్రంథమును వ్రాసినట్లాతఁడు రచించిన యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

శా. వ్యాసప్రోక్తమహాపురాణములు ముయ్యాఱింటియందుం జగ
ద్వాసుం డైన రమామనోహరుమహాత్త్వవ్యక్తిమూలంబులై
భాసిల్లుం దగనాలు గందును బహూపాఖ్యానవిఖ్యాతమై
యా సౌపర్ణపురాణ మొప్పు బహువేదాంతార్థగంభీరమై.

వ. అందుఁ బురాణసారంబై శ్రవణమంగళంబగు శ్రీరంగమహాత్త్వంబు మదంకితంబుగా నాంధ్రభాషా కౌశలంబు పచరించి రచియింపవలయు."

ఈ శ్రీరంగమహాత్మ్యము చాగయకుమారుఁ డైనరాఘవామాత్యున కంకిత మీయఁబడినది. ఈతఁడు మధ్వుఁడై యుండును. ఈతని వంశమును గవి పెక్కుపద్యములలో వర్ణించియున్నాఁడు. అం దీక్రింది పద్యములయందుఁ దక్క దక్కినవానిలో చారిత్రమున కుపయోగపడు నంశములు లేవు. ఈ క్రింది రెండుపద్యములును గృతిపతి కగ్రసోదరుఁ డైనవిఠ్ఠలమంత్రిని వర్ణించినవి. కవికాలనిర్ణయమునకుఁ దోడుపడునని తలంచి యిట వ్రాయుచున్నాఁడను.

మ. పటుధాటీముఖజృంభమాణకలహ ప్రోద్ధార్వసంఘాతవి
స్ఫుటరింఖాపుటకోటిఘట్టన పరిక్షుణ్ణక్షమోద్యద్విశం
కటఘూళీపటలప్రశోషిత మహాకర్ణాటసేనాసము
ద్భటపాథోనిధి విఠ్ఠలేంద్రుఁ బురణింపన్ మంత్రు లేరీ ధరన్ ?

సీ. చండదిగ్వేదండకాండ ధూర్వహమహీ
మండలోద్ధరణసమర్థ మగుచు,
దుర్వారపరిపంథి సర్వసంపద్గర్వ
నిర్వాపణక్రియానిపుణ మగుచు,
వేదాదివిద్యావినోద విద్వజనా
మోదాతిశయ సముత్పాది యగుచు,
జంభజిన్మదకుంభికుంభీనసాధీశ
శంభుభూభృద్ద్యుతిస్వచ్ఛ మగుచుఁ
బరఁగు నేమంత్రిభుజబలప్రకటశౌర్య
దానసత్కీర్తు లప్రతినూనమహిమ
నాతఁ డిమ్మడిసైపఖానాధిరాజ్య
భారధుర్యుఁడు విఠ్ఠలప్రభువరుండు.

ఈపద్యములలో నీవిఠ్ఠలుఁడు "ప్రశోషితమహాకర్ణాట సేనాసముద్భటపాథోనిధి" యనియు. "ఇమ్మడిసైపఖానాధిరాజ్యభారధుర్యుఁ" డనియువర్ణింపఁబడినాఁడు. బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారుఇమ్మడి యనఁగా సంగమవంశములోని రెండవదేవరాయలని యర్థము చెప్పి దానినిబట్టి కవికాలనిర్ణయ మొనర్చినారు. కాని యది పొరపాటని తోఁచుచున్నది. ఆ "యిమ్మడి" శబ్దము సైపఖానునకు వర్తించును. అనఁగా రెండవసైపఖానుఁ డనియర్థము. ఈరెండవ సైపఖానునికడ మంత్రిగానుండి విఠ్ఠలుఁడు కర్ణాటసేనాసముద్రము నింకింపఁ జేసినవాఁ డని యూహింపఁదగియున్నది. "ఇమ్మడి" శబ్దమును వేఱుగావిడదీసి రెండవప్రౌఢదేవరాయలని యర్థమును జెప్పినచో సైపఖానుశబ్దమర్థములేనిదై పోవును. కావున నాశబ్దమునకు రెండవసైపఖానుఁ డను నర్థమును గ్రహించుటయే మంచిది. కాని యీసైపఖానుఁ డెవ్వఁడో తెలియదు. ఇతఁడుకర్ణాటరాజులతో యుద్ధమొనర్చిన యొకమహమ్మదీయ సామంతుఁడై యుండును. ఆతనికడ నీవిఠ్ఠలుఁడుమంత్రిగానుండి

యుండును. ఈసయ్యపఖానును గుర్తింపఁగలిగితిమేని కవికాలమునరిగా నిర్ణయింపఁగల్గుదుము.

శ్రీరంగమాహాత్మ్యమునందలి యీతనికవిత్వముప్రౌఢమై భక్తి రసపూరితమై మనోహరముగా నున్నది. శైలి తెలియుటకై యిదాశ్వాసములనుండియు నైదుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

ఉ. అచ్చెరు వంది సంయమికులైకవిభూషణుఁ డేకియం బ్రియం
బిచ్చఁ దలిర్పఁ బల్కె నతఁ డెవ్వఁడు తద్వచనంబ కాని యీ
పెచ్చుటఁ గానఁబోల దిది యంతయునుం గలదో యథార్థమో
చెచ్చెర నాదుపూన్కి వృథ సేయఁగఁ బన్నినవిష్ణుమాయయో! ౧ఆ

ఉ. లోకభయంకరున్ దశగళుం బరిమార్చుట కేను రామభ
ద్రాకృతి నర్యమాన్వయమునందు జనించి యయోధ్యలోనఁ బు
ణ్యాకర మైనరంగనిలయంబు విభీషణుకిత్తు నాబుధ
శ్లోకుఁడు దేర మీరు ననుఁ జూచెద రీడ వసంతపీఠికన్. ౨ఆ

శా. భూతేశాహ్వయు లుగ్రదండధరు లంభోజాప్తతేజుల్ సము
ద్ధూతస్వేదలలాటభాగవికటభ్రూభీషణుల్ మమ్ము ని
ర్ఘాతక్రూరకరాంఘ్రిజానుహతులం గావించినం దోలి నే
మాతుచ్ఛందిగనాడి వచ్చితిమి నీకాద్యంతముం జెప్పఁగాన్. ౩ఆ

మ. గురులీలన్ విరజోపకంఠమున వైకుంఠంబునన్ దివ్యభా
సురభోగంబుల నిందిరాసహితుఁడై శోభిల్లు నేభంగిఁ దా
హరి యాభంగిన తత్కవేరతనయాభ్యర్ణంబునన్ మంగళా
కరరంగస్మణిధామముఖ్యముగ సౌఖ్యశ్రీలఁ జెన్నారెడిన్. ౪ఆ

చ. వ్రతములలోఁ బ్రశస్తము ధ్రువంబుగ మానవనాథ ద్వాదశీ
వ్రత మది నీవు నిష్ఠ నొకవత్సర మర్థిఁ జరించినాఁడ వూ
ర్జితమగు నమ్మహత్వమునఁ జేసి భవద్భవసంచితాఘ సం
తతి లయమొందెఁ దత్ఫలమితం బది యింతని చెప్పవచ్చునే. ౫ఆ

హరిశ్చంద్రచరిత్రము, నవనాథచరిత్రమునను ద్విపదకావ్యములను రచించిన గౌరనమంత్రి యీభైరవకవికిఁ దండ్రియా ? యనువిషయమునఁ జిరకాలమునుండి చరిత్రకారులు సంశయమునుజూపుచు నిదమిత్థమని నిర్ణయింపకపోయిరి. ఈభైరవుని గ్రంథములనుబట్టి యీతని తండ్రి గౌతమగోత్రుఁడును భ్రమరాంబా వరప్రసాదముచే సాహిత్యకళాకౌశలుఁడునునై యున్నట్లుస్పష్టమగుచున్నది. పైనజెప్పినద్విపదకావ్యకర్తయు గౌతమగోత్రజుఁడే. భ్రమరాంబా వరప్రసాద కవితాశక్తి యుక్తుఁడే. గౌరనకాలము క్రీ. శ. ౧౩౮౦-౧౪౪౦ ప్రాంతమని యాతనిచారిత్రమునన్నిర్ణయించియుంటిమి. భైరవకవికాలమునునిర్ధారణముగాఁ జెప్పఁజాలకపోయినను, యీతఁడురచించిన కవిగజాంకుశమును ముద్దరాజు రామన్న, లింగమకుంటతిమ్మకవి మొదలగులాక్షణికులుదాహరించియుండుటచేతను, మల్లారెడ్డిషట్చక్రవర్తిచరిత్రమున "మందబుద్ధిదియని ముందె చెక్కలిఁగొట్టి కవిగజాంకుశ మిందరికిఁ జూపు" అని శ్లేషించుచుఁ గవిగజాంకుశమును దడవియుండుటచేతను నీతఁడు వారికంటెఁబూర్వుఁడనిస్పష్టమగుచున్నది. అందుచే భైరవకవిద్విపదకావ్య కర్తయగు గౌరనసుతుఁడని తలంచుటకుఁ గాలమాటంకము కలుగఁజేయదు. కాలము, కులము, గోత్రము, భ్రమరాంబావరప్రసాదము,నివియన్నియుసరిపోవుటచే, నీభైరవకవిహరిశ్చంద్రచరిత్రద్విపదకావ్యకర్తయగు గౌరనసుతుఁడని నిశ్చయింపవచ్చును కానియిందుల కొక్కప్రతిబంధకము గన్పట్టుచున్నది. గౌరనమంత్రిరచించిన లక్షణదీపికయనుఛందోగ్రంథములోఁగవిగజాంకుశమునందలి యాంధ్రపద్యములు నాల్గుదాహరింపఁబడి యున్నవనియుఁ దండ్రికుమారుని గ్రంథములోనుండి పద్యముల నుదాహరించుట యసంభవమనియు మానవల్లి రామకృష్ణకవిగారుపీఠికలో వ్రాసియున్నారు. వారియొద్దవివిధదేశముల యందలినాల్గువ్రాఁతప్రతులున్నవఁట! నాల్గునుసమగ్రములైమంచిస్థితిలోనున్నవట. నాల్గిటిలోనుగూడఁగవిగజాంకుశములోనివవినాల్గుపద్యములు నుదాహరింపఁ బడియున్నవఁట! వారియొద్ద గవిగజాంకుశముల

ప్రతులును సంపూర్ణములైనవి యున్నవఁట! వానిలో లక్షణదీపికలో నుదాహరింపఁబడిన పద్యములు లేవఁట! అందుచే లక్షణదీపికలో నుదాహరింపఁబడిన పద్యములు భైరవకవి "కవిగజాంకుశము" లోనివి గాక యంతకుపూర్వము మఱియేకవిచేనైనరచియింపఁబడినయేగజాంకుశములోనివో యైయుండునని రామకృష్ణకవిగా రూహించియున్నారు. ఆపక్షములోఁబైనుడివినప్రతిబంధకము తొలఁగిపోగలదు. శ్రీరామకృష్ణకవిగారేతాముపీఠికలో వ్రాసినది పొరపాటనియు గౌరనకవియుదాహరించిన గ్రంథముకవిగజాంకుశమను సంస్కృతగ్రంథమనియు, భైరవకవి రచించినది కవిరాజగజాంకుశమను నాంధ్రగ్రంథమనియుభారతపత్రికలో(ప్రభవసంవత్సర, ఆశ్వయుజమాసము 3 రవపుట) వ్రాసియుండిరి. కావున నాప్రతిబంధకము తొలఁగిపోయినది. ఈతఁడుగౌరనసుతుఁడనియే నిశ్చయింతము. ఇతనితండ్రి కాలము ౧౩౮౦-౧౪౩౦అనివ్రాసియుంటిని. ఇతనికాలము ౧౪౧౦-౧౪౬౦ అని నిశ్చయింపవచ్చును. ఇతనినివాసమునునిశ్చయింపనాధారములుగానరాలేదు. నిజామురాష్ట్రనివాసియనినాయభిప్రాయము. శ్రీరామకృష్ణకవిగారివ్రాఁతలుపరస్పరవిరుద్ధముగానున్నవి. వానినటుండనిండు. రంగరాట్ఛందము మొదలగు లక్షణగ్రంథములలో నుదాహృతములైన కవిరాజగజాంకుశములోని పద్యములఁ గొన్నిటి నిటనుదాహరించెదను.

క. సేవించిన ధనపతిగా
దీవించును హుంకరించి తిరిగిన భిక్షం
గావించు లక్షణజ్ఞుఁడు
భావింప సమర్థుఁడెన్నఁ బనిలే దితరుల్. ౧

క. జగతి జలానిలానిల
గగన సుధాకర సహస్రకరపరమాత్మల్
తగుపతులు మయరసభజ
నగణముల కవియుఁ బ్రిమథసాధునిమూర్తుల్. ౨

క. పతి మృతుఁడగుఁ బద్యాదిని
మృతనక్షత్రంబు లిడిన మేదురసౌఖ్యా
న్వితుఁ డగు నమృతమువలన న
ప్రతిమము లగుతారకములఁ బద్యాది నిడన్. 3

గీ. గ్రహము ములికి గణము గరి యక్షరము పింజ
పద్య మెసగుకోల చోద్యమైన
జిహ్వావిల్లు నలుకశింజిని లక్ష్యంబు
ధూర్తజనుఁడు సుకవివార్త జోడు. ౪

సీ. అవని గణాలి గణావలి కధిదేవ
తలును వన్నెలు గ్రహంబులును వాని
కులము లు ఫలములు కూర్పులు పగలును
చుక్కపొత్తులు నచ్చుగ నెఱింగి
పిదప మహాభూతబీజ చింతనమును
వర్ణవర్గగ్రహ నిర్ణయంబు
నక్షత్రవేధయు నరిమిత్రశోధన
క్రమముఁ దత్ఫలవిచారమును దెలిసి

తే. తమకు నెదురు లేక తప్పించి ధారుణీ
విభులసభల బుధులు వివిధగతులఁ
జెలఁగి పొగడఁ గవిత చెప్పెడువారు స
త్కవులు గాక యితరకవులు కవులె ? ౫

క. మగణంబు పద్యముఖమున
నగణముతోఁ గూర్చి చెప్పఁ జనుఁగృతియొండెన్
దగఁబద్యమిడిన భర్తకు
నగణితముగ సర్వసిద్ధులగు సత్యముగన్. ౬

క. ఒదుకుచుఁ లక్షణమెఱుఁగక
గొదుకుచుఁ బ్రాసంబు వడియుఁ గూడక మీఁదున్
వెదకుచుఁ బదసంధులు చెడ
నదుకుచు వెడకవిత చెప్పు నతఁడుం గవియే. ౭

క. కమలహితుఁ డున్న నక్ష
త్రము మొదలుగ నేడుదోషతమములు నడుమన్
బ్రమదప్రదములు పండ్రెం
డమరఁగ నశుభములు తొమ్మిదగుఁ బద్యాదిన్. ౮

క. నక్షత్రగ్రహగణభూ
తాక్షర గుణదోషనిర్ణయం బానరింపన్
దక్షులు దారిది గాదని
శిక్షించినఁ గన్ను లెఱ్ఱఁ జేతురు కుకవుల్.

ఇందలి 3. ౫ పద్యములు పరిషత్తువారు ప్రకటించిన ౭౮పద్యములలో లేవు.

ఈభైరవకవితండ్రియగుగౌరన నవనాథచరిత్రమును శ్రీగిరికవి రచించినయాంధ్రపద్యనవనాథచరిత్రము ననుసరించి ద్విపదగా వ్రాసె నని గౌరనకవిచారిత్రమున వ్రాసియుంటిని. ఆశ్రీగిరికవియేశ్రీరంగమాహాత్మ్యమును బద్యకావ్యముగా రచియించెనని తెలియుచున్నది. భైరవకవి యాగ్రంథమును జూచియుండకపోవచ్చును. లేదా, శ్రీగిరి బ్రహ్మాండపురాణము ననుసరించి వ్రాసియుండఁగాఁ దాను గరుడపురాణమును బట్టిరచించియుండును. శ్రీగిరిగ్రంథము లభింపకపోవుటచే నేమియుఁ జెప్పఁజాలను. శ్రీగిరికవిచారిత్రమును నాల్గవసంపుటమున వ్రాసియుంటిని.

ఈభైరవకవిరచించిన కవిరాజగజాంకుశము పరిషత్తువారుప్రకటించిన ౭౮ పద్యములుమాత్రమేనా? ఇంకనుకొంత గ్రంథముగలదా?

యని సంశయము కలుగుచున్నది. పైసీస పద్యమును బట్టి చూచి నచో నింకను గొంతగ్రంథముండవలయునని తోఁచుచున్నది. అది దొరకలేదు.

---

## 67. కొలని గణపతిదేవుఁడు

ఇతఁడు శివయోగసార మనుగ్రంథమును రచియించెను. ఇది పూర్వోత్తరము లను రెండుభాగములుకలది. పూర్వభాగ మెనిమిది యాశ్వాసములు. ఉత్తరభాగమునాల్గాశ్వాసములు. ఉత్తరభాగమును వరంగల్లునందలి శైవ ప్రచారిణీముద్రాక్షరశాలవారు ప్రకటించియున్నారు. పూర్వభాగము వారికి లభింపనందున వారు దానినిముద్రింపలేదు. పూర్వభాగము లభింపకపోవుటచేఁ గవిచరిత్రమునువ్రాయుటకు వారి కవకాశము లేకపోయినది. పూర్వభాగ తాళపత్రప్రతి ౹బ. శ్రీ. వేమూరి విశ్వనాథశర్మ ఎం. ఏ. యల్. టి. గారియొద్దఁగృత్యాదితోఁ గూడనున్నదఁట. దానినిజూచి, చిలుకూరివీరభద్రరావుపంతులుగారు కవిచారిత్రమును 1927 సంవత్సరములో 'సుభాషి'యనుపత్రికలోనొక వ్యాసమును బ్రకటించియున్నారు. ఆవ్యాసమును శైవప్రచారిణివారు ఉత్తరభాగముద్రితప్రతిలోఁ బునరుద్ధరించియున్నారు. ఈకవినిగూర్చి యుఁ గృతిభర్తనుగూర్చియు, గొన్నియంశములను చిలుకూరి వీరభద్ర రావుపంతులుగారు ఆంధ్రులచరిత్రమున వ్రాసియున్నారు.

ఉత్తరభాగమందలి యీక్రిందిపద్యములవలనపూర్వభాగ మెనిమిదియాశ్వాసములును ఉత్తరభాగము నాలుగాశ్వాసములును గలిగి యున్నట్లును, కవి గణపతిదేవుఁ డయినట్లును గ్రంథమందలి విషయమును దెలియుచున్నది.

ఆ. శైవయోగశాస్త్రసారసముచ్చయ
  ప్రకరణములయర్థభావ మెల్ల

తెనుఁగుకవిత తేట తెలివిగా నే భవ
దాజ్ఞ విన్నవింతు నవధరింపు.

చ. గణపతిదేవనామమునఁ గల్గిన యే శివయోగసారముం
బ్రణుతమహాప్రబంధమునఁ బల్కితి నాకృతియుపూర్వభాగముం
దిృణయనభక్తు లౌ ననఁ గథింతు సదాశివయోగనాథ ధీ
మణి యన రూఢి కెక్క గరిమంబున నుత్తరభాగ మేర్పడన్.

శా. విశ్వేశస్థిరభక్తి వర్ధిలఁగ నుర్విం బూర్వభాగాష్టసం
ఖ్యాశ్వాసంబులఁ గర్మయజ్ఞముఁ దపోయజ్ఞప్రకారంబు స
ర్వైశ్వర్యప్రదమై తనర్చుజపయజ్ఞాచారముం గూడఁగా
విశ్వస్తుత్యగతిం బ్రబంధ మమరెన్ విద్వత్పరిగ్రాహ్యమై.

క. ఈయుత్తరభాగంబున
నాయతి రచియింతు నాలుగాశ్వాసములం
బాయక ధ్యానజ్ఞాన మ
హాయజ్ఞద్వయము యమిజనానందముగన్.

క. శివయోగ మిందు నెంతయు
నవిరళమై వెలయుటన్ దదనుకూలముగాఁ
బ్రవిమలమతి నాత్మస్థిత
శివలింగముఁ గొలుతు మొదలుఁ జిన్మయలీలన్.

ఈగ్రంథమును గవి, తనకు మేనమఱఁదియు, గురువు నగు, ఈడూరి నూకనారాధ్యునకుఁ గృతి యొసంగెను. అతఁడు తననుబిలిచి చెప్పినట్లు కవి వ్రాసికొనిన పూర్వభాగమందలి యీక్రిందిపద్యముల వలనఁ గవిగోత్రాదికము దెలియుచున్నది.

సీ. తనమేనమఱఁదియుఁ దనశిష్యుఁడును లోక
మాన్యుండు నై నకౌండిన్యగోత్రు
సురుచిరాపస్తంబసూత్రుని నిందులూ
రన్నయదేవునియన్నమనమ

గన్నయరుద్రభూకాంతుని గణపతి
దేవుని యాదిమూర్తికిని సద్గు
ణాస్పద యగులక్ష్మాంబకుఁ బుత్రినిఁ
దిరమొప్ప గణపతిదేవవిభుని,

తే.గీ. సహితగణపల్లురాయ చౌహత్తమల్లు
నభినవాకారు ధీరు నన్యాంగనా స
హోదరుని నన్ను రావించి యుచితవృత్తి
నస్మదీయపరిణామంబు లాదరించి.

ఈకవినియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌండిన్య గోత్రుఁడు. ఇతనితండ్రి ఆదిమూర్తి. (ఇతనిని ఆదిమూలనామాత్యుఁ డనియందురు. ఈయంశము క్రిందిగద్యవలనఁదెలియనగును.) తల్లిలక్ష్మాంబ. తాతగణపతి; ఆతనితండ్రి రుద్రదేవుఁడు. ఆతనితండ్రిగన్నయ. ఈగన్నయను, మనుమగన్నయయని పిలచెదరు. ఈమనుమగన్నయ, ఇందులూరి అన్నయదేవుని కగ్రజుఁడు. ఇంతవఱకుఁబైపద్యమునుబట్టి కవివంశావళి తెలిసినది.

గద్య. ఇది శ్రీగురుచెన్నసదాశివ యోగీంద్రపదారవిందమధుకరాయ
మాన నిరంతరశివభక్తిసమాధాన కొలనియాదిమూలనామాత్య
పుత్ర అన్యస్తుతిపరాఙ్ముఖ శివస్తుతిసుముఖ సుకవిజనమిత్ర
సరసకవిత్వరచితభావగణపతిదేవ ప్రణీతం బైన
శివయోగసారంబు.

"సుభాషి"పత్రికలో చిలుకూరి వీరభద్రరావుగారీ క్రిందివంశ వృక్షము నిచ్చియున్నారు.

మహావిష్ణువు
|
బ్రహ్మ
|




సుభాషిపత్రిక నాకులభింపలేదు. సుభాషిపత్రికలోని వ్యాస మును శివయోగముద్రితప్రతి పీఠికాకారులు సంపూర్ణముగాఁ బ్రకటిం

చిరోలేనో చెప్పఁజాలను. ఈవంశవృక్షమునుబుజువుచేయుశివయోగ సారమందలి పద్యములన్నియునావ్యాసమునఁ బొందుపఱుపఁబడలేదు. అయినను వీరభద్రరావుపంతులుగారు చారిత్రకచతురాననులగుటచే వంశవృక్షమును శివయోగసారమందలి పద్యములనుబట్టి సరిగా వ్రాసి యుందురనిమనమువిశ్వసింపవలసియున్నది. పైనవ్రాసినసీసపద్యములో అన్నయదేవునకుమనుమగన్నయ, అన్నయనివ్రాయబడియున్నది. ఈ వంశవృక్షమునుజూచినచో మనుమగన్నయ, యన్నయదేవునకుఁ గేవల మగ్రజుఁడుగాక పెదతండ్రికుమారుఁడైనట్లుకన్పట్టుచున్నది. వంశవృక్ష మే సరియైనదనియు పైసీసపద్యమువరుసకు, అన్నయను భావముతో వ్రాయఁ బడినదనియు, నూహింపవలసియున్నది. అన్నయదేవుఁడు కాకతీయ వంశస్థుఁడైన గణపతిదేవునికుమార్తెయగు రుద్రాంబకును చాళుక్య వంశములోనివాఁడైన వీరభద్రమహారాజునకును గలిగిన దుయ్యాంబయను కన్యకను బరిణయమాడినట్లు చిలుకూరి వీరభద్ర రావుపంతులుగారు కాకతీయాంధ్ర యుగమున వ్రాసియున్నారు. అన్నయదేవుఁడు నియోగిబ్రాహ్మణుఁడు; కాకతీయులు శూద్రులు. చాళుక్యులు క్షత్రియులు. ఈవివాహ మెట్లుజరిగినదను సంశయము కలుగుచున్నది. బ్రాహ్మణుఁడు నాలుగువర్ణములవారిని వివాహ మాడవచ్చునను సూత్రమిక్కడనన్వయించెనని తలంపవలసియున్నది. అన్నయదేవుఁడు రుద్రాంబనే కాకుండ పార్వతి, లక్ష్మమ్మ అను స్వజాతీయులనిరువురనుబరిణమాడెనని శివయోగసారమందలియీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

"కాకతి రుద్రాంబ గాదిలిసుతయైన
దుయ్యంబఁ బెండ్లాడి రూఢి కెక్కె
అద్రిజ, లకుమాంబ లనవిలసిల్లెడు
కులభామినులను మక్కువ వరించె."

పైనిఁ గనుపంచినవంశములోఁ గవివంశమునకు మూలపురుషుఁ డైన నానగార్యుఁడు ఇందులూరివిభుఁడై నిజామురాష్ట్రములోని

యనుమకొండయం దుండెడివాఁడని యీక్రిందిపద్యములోఁజెప్పబడి యున్నది.

మ. ప్రభుఁ గౌండిన్యమునీంద్రగోత్రమున నాపస్తంబసూత్రింబునం
దభవాంఘ్రిద్వయసేవకుండయి ఘనుండై యన్మకొండన్ పురిన్
విభవం బొందఁగ నిందులూరివిభుఁడై విఖ్యాతినిం జెందె వీ
తభయాత్ముండగు(నానగార్యుఁడు?)పుత్రితోఁ దాగుండు ధీకుండొగిన్

ఈతనినిబట్టియే యీతనివంశమువారికి, ఇందులూరి నారని పేరు వచ్చిన ట్లూహింపఁదగును. ఇందులూరివిభుఁ డనగా నిందులూరునకు కరణ మనితలంపవచ్చును. ఈనానగార్యునికుమారు లైనపెదమల్లన, చినమల్లనలు రుద్రదేవునికడ మంత్రులుగా నున్నట్లును. ఈరుద్రదేవుఁడే అనుమకొండనుండి తనరాజధానిని ఓరుగల్లునకు మార్చినట్లును నీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

తే. అనుమకొండపురంబు గాదని యావిభుండిల నోరుగ
ల్లనుపురంబు ఘటించి యచ్చటి కచ్చుగా నరుదెంచి య
మ్మనుజనాథుఁడు నాయకత్వము మల్లమంత్రికిఁ బిన్నమ
ల్లనకు ధారుణి పెద్దసంపతి నాతతంబుగ నిచ్చినన్.

పెద్దమల్లనకుమారుఁ డైన సోమమంత్రినిగూర్చి శివయోగసారమునం దీక్రిందిపద్యములు వ్రాయఁబడియున్నవి.

గీ. సకలవేదశాస్త్రసంపన్నుఁ డమిత య
శోధనుండు బంధుసుజనహితుఁడు
గరిమ పోచమాంబికా వరసుతుఁడు
కేవలుండె సోమమంత్రివిభుఁడు.

క. మహారుద్రరాజు కనుజుఁడు
మహాదేవుఁడు తత్పుత్రుండు మఱి గణపతినా
నహితభయంకరు డాతని
మహిమను (... ...)సోమమంత్రీశ్వరుడున్.

చ. ఇల బహుసైన్యముల్ గొలువ నేకశిలాపురి తూర్పుదిక్కునం
గలరిపుభూములెల్లఁ గొని గర్వముమై (...) కాడిమండలీ
కుల నవలీలఁ దోలి మఱి గోగులనాఁడును గొల్నివీడు నా
వెలసినదుర్గముల్ గొనుచు వేగమె గౌతమిదాఁటి యిమ్ములన్.

క. మాడియు రెండుం గొని యా
డాడెడిపన్నెండు మన్నియములు నొడిచి తా
నాడె కళింగయసీమకు
గూడినభువిఁ గొనియె సోమకులముఖ్యుఁడొగిన్

ఆ. లీలఁగొలని మండలీకుల వెసఁద్రోలి
గొలనివీడు దాను గొనుటఁ జేసి
కాకతీశుఁడైన గణపతియండను
కొలని సోముఁ డనఁగ వెలసె జగతి.

ఈసోమయామాత్యుఁడు కాకతీయగణపతియొద్దప్రధానమంత్రి
గను దండనాయకుఁడుగ నుండి, ఓరుగల్లునకుఁ దూర్పునఁ గళింగము
వఱకు నున్న ప్రదేశమును జయించినట్లును, కొలనువీఁడు మండలేశ్వ
రులను బాఱద్రోలి యాదుర్గమును గైకొనుటచే నాతనికికొలనిసోముఁ
డని ప్రఖ్యాతి వచ్చెననియుఁ బైపద్యములలోఁ జెప్పఁ బడినది. కొల
నువీఁ డనఁ గా నిప్పటి యేలూరుపట్టణమే. సోమయామాత్యునిమూల
మున నీతని వంశీయులకు నిందులూరివా రనునింటిపేరు మాఱిపోయి
కొలనువారను పేరువచ్చినది. ఈసోమయామాత్యుని యనుజుఁడైన
పెదగన్న భూపతికూడ గణపతిదేవునియొద్ద మంత్రియుఁ దండనాయ
కుఁడుగా నుండినట్లు శివయోగసారమున నున్నదని చిలుకూరి వీరభద్ర
రావుపంతులుగారు కాకతీయాంధ్రరాజయుగ చారిత్రమున వ్రాసి
యున్నారు.

ఈపెదగన్నామాత్యునికుమారుఁడైనఅన్నామాత్యుఁడు ప్రసిద్ధ
పురుషుఁడు. ఇతనినిగూర్చి వీరభద్రరావుగారు కాకతీయాంధ్రరాజ
యుగచరిత్రమునం దీవిధముగా వ్రాసియుండిరి.

"అవక్రపరాక్రమముతో నాంధ్రదేశమున ముప్పదియైదు లేక నలువదిసంవత్సరములు పరిపాలనముచేసి ఖ్యాతిగాంచిన కాకతిరుద్రమదేవి చక్రవర్తిని కల్లుడును, కాకతిప్రతాపచక్రవర్తికిఁబినతల్లిపెనిమిటియునగు నీయిందులూరి అన్నయామాత్యుఁడు (ఇతనిని అన్నయదేవుఁడనికూడనందురు) గణపతిదేవచక్రవర్తి మంత్రియును, సైన్యాధ్యక్షుఁడుగానునుండి కళింగదండయాత్రలు నడిపించిన సోమయామాత్యునికిఁ దమ్ముఁడును, అతనిప్రసిద్ధసేనాపతులలో నొక్కఁడునగు పెద్దగన్నయామాత్యునిపుత్రుఁడునైన ప్రతిభాశాలి ఇతఁడురుద్రమదేవికాలమునను రెండవప్రతాపరుద్రదేవునికాలమునను, మహోన్నతపదవిని వహించుటయేగాక తనప్రతిభావిశేషముచేఁ గాకతీయాంధ్ర సామ్రాజ్యమును బ్రోచుచు తుదకా మహాసామ్రాజ్యముతోనే యస్తమించినమహావీర సైన్యాధిపతియు మహామాత్యుఁడునై యున్నవాఁడు. స్ఫురద్రూపియు బాహుబలసంపన్నుఁడు మాత్రమేగాక మంచిరాజనీతి విశారదుఁడునై యాకాలమున విశ్వేశ్వరశివదేశికుని యపరావతారముగ సర్వజనులచేఁ బరిగణింపఁబడు చుండినవాఁడు. కనుకనే కొలనిగణపతిదేవకవితచే రచింపఁబడిన "శివయోగసారంబను వేదాంతగ్రంథముననవతారికలో నీతనిని తనపూర్వులలోనివానిగఁ జెప్పుచు నిట్లభివర్ణించియున్నవాఁడు.

సీ. అత్యుత్తమం బైనయత్యాశ్రమస్థుండు
కారణజన్మ సంగతి వహించె
ప్రకటసామ్రాజ్యసంపదలు సకలబంధు
కోట్లతోడను పంచుకొని భుజించె
మోపురిరాజుల సేవణంచుచు రాయ
చౌహత్తమల్లుడై జగతిఁబరగె
స్థలగిరివనదుర్గ జలకోటమల్లుఁడై
గ్రక్కునఁ బెక్కుదుర్గములు గొనియె
నోపి తురకలఁ గెలిచి ప్రతాపరుద్ర
మనుజనాయకుకోట నేమరక కాఁచె

ననుచుఁ బొగడంగ నెగడె నియ్యావని నిందు
లూరియన్నయదేవుఁ డనూనబలుఁడు."

ఈయన్నయదేవుని కాలములోనే మహమ్మదీయులువరంగల్లు బూఁదకు దండెత్తివచ్చి పూఁడుమారు లోడిపోయిరని చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఈవిషయము మీఁదిపద్యములోని మొదటి రెండు పాదములును ధ్రువపరచుచున్నది. ఈయన్నమంత్రి పూర్వజన్మమున నొకయతీశ్వరుఁడు. ఆతఁడవసానకాలమున నీయన్నయామాత్యునితల్లి కడకువచ్చి "అమ్మా! నాకవసానము తటస్థించినది. కర్మవశమున నాకింక నొకజన్మ మెత్తవలసియున్నది. నేను గొల్దిదినములలో నాశరీరమును వీడి మఱల నీగర్భమునఁ బుత్త్రుఁడనై జన్మించెదను. అజన్మముతో నాకుముక్తి కలుగును. నీకును మోక్షము కలుగును." అని చెప్పెనఁట. అట్లే యీయన్నయామాత్యుఁడు ఆమెగర్భమున జన్మించెనఁట యతిచెప్పిన లక్షణము లీతనియందుఁ గన్పించుటచే నాతఁడే యీతఁడని నిశ్చయించి యాపుణ్యసాధ్వి యీతని నతిగారా బముతోఁ బెంచెనఁట! ఈవైయక్తిముమునే యీనీసపద్యమందలి ప్రథమ పాదమునఁ గవివర్ణించియున్నాఁడు.

ఈయన్నయామాత్యుఁడుపాలకురికిసోమనాథుని శిష్యుఁడనియు సోమనాథునికోర్కెపై డోకిపఱ్ఱును అగ్రహారముగాఁ బ్రతాపరుద్ర మహారాజుచే శివభక్తుల కీయన్నయామాత్యుఁడే యిప్పించెననియు, పిడుపర్తి సోమనాథకవి తనబసవపురాణకృత్యాదియందు లిఖంచియున్నాఁడు. రెండవప్రతాపరుద్ర మహారాజునొద్ద నీయన్నయామాత్యుఁడును నీతనిపెదతండ్రిమనుమఁడైన రుద్రదేవుఁడునుగూడదండనాయకులయి యుండినట్లు శివయోగసారములోని యీక్రిందిపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది.

చ. అకుటిల రుద్రమాంబికకు నాత్మజ నాఁబొగడొందు ముమ్మడ
యమ్యకు మహాదేవరాజునకు నాత్మజుఁడైన ప్రతాపరుద్రుఁ డా

సకలమహీభరంబును వెసన్ దనయంత వహించి దాల్చినా
యకమహిమంబులన్ దొరిదె యన్నయదేవుఁడు రుద్రదేవుఁడున్.

ఈరుద్రదేవుని శాసనమొకటి నెల్లూరుమండలమునందలి పాకాలయం దున్నది. అది శా. శ. ౧౧౯౦ విభవసం॥ చైత్రశు౧౦ నాఁటిది (నె. శా. సం. ౪౮౪ పుట) ఇందు రుద్రమదేవి పేరుకూడకలదు రుద్రమదేవి క్రీ శ. ౧౨౬౦ మొదలు ౧౨౮౪ వఱకును, రెండవప్రతాపరుద్రమహారాజు ౧౨౯౪ మొదలు ౧౩౨౬ వఱకును రాజ్యము చేసినవారు. కావున మనయన్నయామాత్యుఁడును, రుద్రదేవుఁడును ఆకాలమునందున్నవారనుట నిశ్చయము.

గణపతిదేవకవి రచించిన శివయోగసారమును గృతినొందినవానిని గూర్చికూడఁ గొంత వ్రాయవలసియున్నది. ఈగ్రంథమునకు, గృతిపతి ఈడూరి నూకనారాధ్యుఁ డయిన ట్లీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

క. శ్రీగురుచెన్నసదాశివ
యోగీంద్రకులాబ్ధిచంద్ర! యోగివిమత! శై
వాగమసారార్థజ్ఞా
నాగార! యిడూరి నూకనారాధ్యవరా!

ఈపద్య ముత్తరభాగములోనిది. పూర్వభాగములోనిపద్యములనుజదివి వీరభద్రరావుపంతులుగారు కృతిపతియింటిపేరుఇందులూరివారని నిశ్చయించి సుభాషిపత్రికలో నీక్రిందివాక్యములను వ్రాసియున్నారు. కాకతీయాంధ్రరాజ యుగచరిత్రమునందుఁగూడ ఇందులూరివారనియే వ్రాసియుండిరి. "కృతికర్తయొక్కయుఁ గృతిభర్తయొక్కయు నింటిపే రిందులూరివారై యుండఁగ నెట్లీయుభయకుటుంబములకు సంబంధములు గలసినవని" చదువరులకు సంశయము గలుగవచ్చును. వీరికింటిపే రొక్కటియైనను గోత్రభేదముకలదు. కృతికర్తది కౌండి

న్యసగోత్రము. కృతిభర్తది హారితసగోత్రము. కవితనగ్రంథమునఁగృతి
నాథుని వంశము నిట్లభివర్ణించియున్నాఁడు.

ఆ. హారితగోత్రజాతుఁ డగుచు నాపస్తంబ
వితతసూత్రమునను వేఁగినాఁట
భూమిలోఁ బ్రసిద్ధి బొందెను నూకనా
ర్యుండు సుజనబంధు మండనుండు.

క. ఆనూకనప్రెగ్గడకును
సూనుండై బల్లప్రెగడ సుధి యొప్పారెన్
ధీనిధి నిరవద్యాపుర
మానవనాథులకుఁ దా నమాత్యుండగుచున్.

ఆ. అతనిసుతుఁడు వరశివాచారసక్తుఁడు
జననుతుండు ధైర్యశౌర్యయుతుఁడు
జగతి నికుదప్రోలి చక్రవర్తులరాజ్య
మహిమదాల్చె నాగమంత్రి యనఁగ.

ఆ. భూరిసద్గుణముల పొగడఁగ నెగడు కో
మ్మాంబ నతఁడు పెండ్లియై గృహస్థ
ధర్మ మెల్లఁ జెప్పెఁ దనయందు గలుగంగ
మెలఁగె సకలబంధుమిత్రుఁ డగుచు.

క. తద్దంపతులకుఁ బుత్త్రకు
లిద్దఱు నాగయయు వల్లభేంద్రుఁడు ననఁగాఁ
దద్దయు వర్ధిలి రందును
బెద్దయయిన నాగమంత్రి పృథ్వీస్థలిపై.

ఆ. జనులెఱుంగ రాయచౌహత్తమల్లుఁడై
వెలయు కొలని రుద్రవిభుని పుత్ర
తిలక మైనగణపతి క్షితిపతిపుత్రి
గారిఁ బెండ్లియయ్యెఁగారవమున.

సీ. బాల్యమునను దా నపారధర్మంబులా
ర్జించె ధార్మికులు వర్ణించుచుండ
న్యాయమార్గమున నర్థార్జనం బొనరించి
బంధుమిత్రుల బాల్యపరతఁ బోిచెఁ
గామ్యమార్జించుచోఁ గామినీమకరాంకుఁ
డతఁడె పొమ్మనఁగఁ బ్రస్తుతికి నెక్కె-
కాశిలోఁ గదలక పాశుపతవ్రత
శీలుఁడై మోక్ష మార్జించి మించె

తే. గీ. కాన ధర్మార్థకామమోక్షములు సుకర
మున నుపార్జించి నాగచమూవరుండు
తజ్జ్ఞఁడై తుది నాశ్రమాంతరము చేసి
యాయజుర్వేదగురునామధేయుఁ డగుచు.

క. ఆనాగయవిభువరునకు
మానినియై యొప్పు గౌరమకుఁ బ్రియసూనుం
డై నూకయ్య యనంగను
(ననూనమహిమంబునొప్పు) నవనీస్థలినిన్

సీ. శ్రీగురుండగుయజుర్వేదగురువుల నం
దనుఁడును (ప్రియశిష్యతముఁడు?) నట్టి
పూర్వకాలమునందు భూతేశు శంకరుఁ
బూజింపనేర్చినపుణ్యుఁ డట్టి
సకలవేదపురాణ శాస్త్రార్థసారసం
విజ్ఞాత యైన సర్వజ్ఞుఁ డట్టి
శ్రీగురుకృపఁ జేసి సిద్ధమతంబున
నధ్యాత్మసంవేత్తయయ్యె నట్టి

తే. గీ. కాశికాదేశముఖ్యప్రదేశములఁ జ
రించి కులకోటులను నుద్ధరించె చన్న

గురుసదాశివయోగి నాఁ బరఁగునట్టి
(యిందులూరి నాకయమంత్రి) కెవ్వరీడు

ఆ. వె. పూడి కొమ్మరాజు పుత్రిపతివ్రతా
తిలకమైన గౌరిదేవి మొదట
పిదప లక్ష్మిదేవిఁ బెండ్లియై వేడుక
యలర వెలసె నమ్మహాత్ముఁ డిలను.

ఈపద్యములలోఁ గుండలీకరించినభాగములు సుభాషితత్రిక లోఁగూడఁ గుండలీకరింపఁబడియేయున్నట్లు శివయోగసారపీఠికనుబట్టి తెలియుచున్నది. మాతృకలో లేనిభాగమును, ఇతరులు పూరించినప్పు డిట్లు కుండలీకరించుట వ్రాయసకారుల సంప్రదాయము. పైపద్యము లలో "ఇందులూరి" యనుగృహనామము ఒక్కతావునమాత్రమే యున్నది. అదికుండలీకరింపఁబడినభాగములోనిది కావుననాభాగమును వీరభద్రరావుపంతులుగారో మరియెవ్వరో పూరించియున్నట్లు తోఁచు చున్నది. అట్లు పూరించినవారికి "ఇందులూరి" యనిపూరించుట కాధారములేవియున్నవో తెలియ లేదు. కాకతీయాంధ్రరాజయుగచరిత్ర ము నందలి ౨౭౦ వ పేజీలో "నిడుదప్రోలునుబరిపాలించినచక్రవర్తి బిరుదాంచితులగు చాళుక్యరాజులకు మంత్రులుగా నుండెడివా రిందు లూరివా రనిశివయోగసారమనుగ్రంథమున నీక్రిందిపద్యములలో వరుస క్రమమున నిందులూరి నాకరాజును వానికుమారుఁడు బల్లప్రెగడను, వానికుమారుఁడు నాగయమంత్రిని బేర్కొనియున్నాఁడు" అనివీరభద్ర రావుపంతులుగారువ్రాసి, పైనివ్రాసినపద్యములలోనిమొదటిమూఁడు పద్యముల నుదాహరించియున్నారు. కానియామూఁడుపద్యములలోను "ఇందులూరి" యనుశబ్దము లేదు. కావున శివయోగసారకృతిభర్త గృహనామము "ఇందులూరి" కాదని నిశ్చయ మగుచున్నది. అతని యింటిపేరు "ఈడూరి" యైనట్లే క్రిందివాక్యములలోనాగ్రంథపీఠికా కారులువ్రాసియున్నారు. అది సత్యమనుటకు సంశయములేదు.

"ఈశివయోగసారమునందలి యుత్తరభాగప్రారంభమునఁ గల పైపద్యమువలన (శ్రీగురుచెన్నసదాశివ—యనునది) 'యిదూరి' వారని తోఁచుచున్నది. కొన్ని తాళపత్రగ్రంథములందు "యీదూరి' యని కలదు. "శైవాగమసారార్థజ్ఞ" యనునంతవఱకునిలిపి కొందఱు "నాగరయీదూరి" వారనియనుచున్నారు. నాగారమను పేరుగల గ్రామములు నిజాంరాష్ట్రమునఁ గలవు. మాకులభించిన తాళపత్రగ్రంథములఁబట్టివిచారింపఁగా "నాగారయిదూరి" యనియొకప్రతియందును "నాగరయీదూరి" అనిమఱొకప్రతియందునుగలదు. "శైవాగమసారార్థజ్ఞనాగార" యనునంతవఱకును పదమును విభజించినచో నూకనారాధ్యునియింటిపేరు యిదూరివారనియో లేక యీదూరి వారనియో చెప్పవలసివచ్చుచున్నది. అటులయినచో మ॥ రా॥ చిలుకూరివీరభద్రరావుగారు వ్రాసినటుల గోత్రభేదమేకాక గృహనామభేదముకూడ నున్నటులఁ జెప్పవచ్చును."

కృతిపతివంశమునకుమూలపురుషుఁడైననూకనారాధ్యుఁడు వేఁగినాఁటివాఁడని పైపద్యములోనున్నది. కావునఁ గృతిపతినివాసము నిజామురాష్ట్రముగా భావింపరాదు. కృతిపతివంశీయులు నిడుదవోలురాజునొద్ద మంత్రులుగా నుండిరి. నిడుదవోలు వేఁగినాటిలోని గోదావరిమండలములోనిది ఆమండలములో తణుకుతాలూకా యందు ఈదూరను గ్రామమున్నది. నిడుదవోలు కూడ తణుకు తాలూకా లోనిదే. ఈయీదూరునుబట్టి కృతిపతివంశమువారికి ఈదూరివారని గృహనామము వచ్చియుండునని నేనూహించుచున్నాఁడను. కృతికర్తవంశము వారు కొలనువీడు అనఁగా నేలూరునందే యుండిరనియు; ఏలూరునం దుండఁగనే కృతిభర్తలవంశమువారితో సంబంధబాంధవ్యములు కలిసి యుండుననియుఁ దలంపవలసియున్నది. తణుకుతాలూకాయును, ఏలూరుతాలూకాయును నొకదాని నొకటి యంటియున్నవి. ఇందులూరు నిజామురాష్ట్రములోనిది. శంకరకవికృతహరిశ్చంద్రోపాఖ్యానకృతిపతి యగు ఈదూరి యెల్లయామాత్యుఁ డీవంశములోని వాఁడేమో?

ఈడూరివారివంశవృక్షము నీక్రింద నిచ్చెదను.

నూకనామాత్యుఁడు
|
బల్లపెగ్గడ (నిరవద్యపురప్రభువు నొద్ద మంత్రి)
|
నాగమంత్రి=కొమ్మాంబ (నిడుదవోలు ప్రభువు నొద్దమంత్రి)
|
నాగయ్య — వల్లభయ్య

నాగయ్య
=
గౌరి (కొలనిగణపతి కుమార్తె)
|
నూకయ్య. (ఇతఁడే శివయోగసారకృతిపతి)
=
గౌరి—లక్ష్మి.

ఇందులో గౌరిభర్తయైననాగయ్య కాశిలోఁ బాశుపతవ్రత మనుష్ఠించి, తుదకు సన్యాసాశ్రమస్వీకారముచేసి యజుర్వేదగురువను నామధేయమువహించెను. నిరవద్యపురప్రభువులును నిడుదవోలు పుర ప్రభువులును దూర్పుచాళుక్యవంశీయులే.

కవి గ్రంథరచనాకాలమును జెప్పియుండలేదు. కవికి ముత్తాత యైనరుద్రదేవుఁడు ప్రతాపరుద్రునియొద్ద మంత్రిగా నుండెనని పైనిఁ జెప్పియుంటిని. ప్రతాపరుద్రునిరాజ్యము క్రీ. శ. ౧౩౨౬ తోనంత మొందినది. రుద్రదేవునితమ్మునిమునిమనుమఁడైన గణపతిదేవకవి క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమునం దుండెనని నిర్ణయించుటలో బ్రమాద ముండనేరదు. కావున గ్రంథరచనాకాలము పదునైదవశతాబ్దియందు బ్రథమభాగ మని నిశ్చయింపవచ్చును. వీరేశలింగముపంతులుగా

రీకవిని యాధునికకవులలోఁ జేర్చి "యిన్నూఱుసంవత్సరములకుముందే యుండినవాఁడయినట్లూహింపఁదగియున్నాఁడు" అని వ్రాసియున్నారు. శివయోగసార కృత్యాది వారికి లభింపకపోయియుండును. అందుచే వారట్లువ్రాసియుందురు. ఈకవిని అనియాది గణపతిదేవుఁడని శ్రీపంతులుగారు పేర్కొనియున్నారు. అదిపొరపాటు.

ఇచ్చట మఱియొక ముఖ్యవిషయమును గూర్చి చెప్పవలసియున్నది. కృతిపతికిఁ బ్రపితామహుఁ డగుబల్లపెగ్గడనిరవద్యపురమానవనాథులయొద్ద మంత్రిగానుండెనని పైపద్యములలో నొకదానియందు జెప్పియున్నాఁడు నిరవద్యపురమనఁగా నిడుదవోలు పట్టణమనిచరిత్రకారు లందఱును నభిప్రాయపడియున్నారు. నేనును నట్లేతలంచి, యీ కవితరంగిణియందచ్చటచ్చటనట్లేవ్రాయుచువచ్చితిని. కానితరువాత నావిషయమున నొక్కింత సంశయముకలిగినది. గోదావరిమండలమునందలి తణుకుతాలూకా మల్లిపూడిగ్రామమును నిరవద్యపురముగానుదాహరించుచు నందలియగస్త్యేశ్వరస్వామి కఖండదీపమునునిల్పికొమ్మన పెగ్గడ యొకశాసనమును శా.శ. ౧౨౨౫లో వ్రాయించెను. (A. R. 537 of 1929) ఈశాసనము మల్లెపూడి యందేయున్నది. ఈగ్రామమునందే తూర్పుచాళుక్య సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజను పృథ్వీవల్లభ మహారాజుశాసనమొకటిశా. శ. ౧౨౧౯లో కలదు. ఈ గ్రామమున కత్యంతసమీపముననె జుత్తిగయను గ్రామమున్నది. ఈ గ్రామమునఁ గాకతిరుద్రాంబభర్త యైనచాళుక్యవీరభద్రుఁడుదావ్వాతుఁడైన శాసనమున్నది. ఈచాళుక్యులరాజధానినిరవద్యపురమనునామాంతరముగల మల్లెపూడి యనియు జుత్తిగకూడ రాజధానీనగరమునం దొకభాగమై యుండుననియుఁ బిమ్మట వారిరాజధానినినిడుదవోలునకు మార్చిరనియు దోఁచుచున్నది. ఈమార్పు క్రీ. శ. ౧౩౦౦ వ సంవత్సరప్రాంతమున జరిగియుండును.

శివయోగసారకృతిపతులను వర్ణించుటలో బల్లపెగ్గడను "నిరవద్యపుర మానవనాథులయొద్ద మంత్రియనియు" నాతనికుమారుఁడైన

నాగమంత్రిని "నిడుదప్రోలిచక్రవర్తుల రాజ్యమహిమ" దాల్చెనని యు వర్ణించుటచేత నాగమంత్రికాలములో రాజధానీనగరమును మార్చినట్లు కన్పట్టుచున్నది. నిరవద్యపుర, నిడుదవోలునగరము లొక్కటి కావని యిందువలన స్పష్టమగుచున్నది.

గణపతిదేవుని కవిత్వము ప్రౌఢమయి హృద్యముగా నున్నది. శివయోగసారమున శివప్రతిపాదక మైన యాధ్యాత్మిక విషయము, కర్మయజ్ఞము తపోజపధ్యానజ్ఞాన యజ్ఞములును, పంచయజ్ఞములరూపమున విరింపఁబడినది. ఇందు పూర్వభాగము నాకులభింపనందున వీరేశలింగము పంతులుగారాంధ్రకవులచరిత్రమున నుదాహరించినమూఁడు పద్యములను, ఉత్తరభాగమునుండి నాలుగుపద్యముల నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

చ. ప్రమదముతో నొకింతయినఁ బాత్రునకేగి మహాఫలంబగున్
బ్రమసి యపారవిత్తము లపాత్రునకిచ్చినఁ గీడుపొందు ఘా
సము నొసఁగంగ దుగ్ధములఁ జాలఁగ ధేనువులిచ్చువట్టి దు
గ్గములొసఁగన్ విసంబొలుకుఁగాదె భుజంగమయూధమిమ్మహిన్.

ఉ ఈక్రియఁ గర్మమేర్పడిన నెంతయుభీతి జనింపుచుండఁ జిం
తాకులచిత్తమై కటకటా యిదియేమినిమిత్తమొకదా
నాకని కన్నుఁదమ్ముల ఘనమ్మగబాష్పము లేగుదేరఁగా
శోకభరాబ్ధిలో మునిఁగి సుందరికోకిలవాణి యేడ్వఁగన్.

మ. ఎనయన్ జీవనచింతఁ బొట్టుపొరలై యేప్రొద్దువర్తించు నీ
చుని యందుంగల శీలసూనృతగుణస్తోమంబులిట్లన్నియున్
దనరంబక్వముకాని కుంభమున యత్నించంబార నిండంగఁ బో
సిన వారావరముభంగి నాశమగుఁజర్చింపంగ దేహంబుతోన్. 3 ఆ

ఉత్తరభాగము:—

ఉ. ఆపరమేశ్వరున్ శివుని నగ్ని దివాకరచంద్రమండల
స్థాపితచిత్స్వరూపు విలసద్గురునాథకృపావలోకనో

ద్దీపిత నిర్మలాత్ముఁడయి ధీగతి నెవ్వఁడెటెంగి నేర్పుమై
నోపి భజించుచుండు నతఁడొందు నకుంఠితమోక్షసౌఖ్యముల్. ౧౮

క. సంకల్పవికల్పములే
వంకం బోరయంగనీక వైరాగ్యనిరా
తంకమతి జేయుకర్మము
గొంకక సంగతిపరిదంబగున్ విమలాత్మా. ౨౮

ఉ. రేచకపూరకంబులవి రెండునడంచిమనఃప్రచారిమ
డ్వీచి హృషీకనాశనము వేగమచేయఁగఁ జాలు కేవలం
బైచను కుంభకంబు సముదంచితబుద్ధిఁ దదీయశుద్ధి వి
ద్యాచతురత్వశుద్ధిగలయాతని కెందు నసాధ్యమున్నదే. 3 ౮

తే. గీ. వేదములు శాస్త్రములు బహువిధపురాణ
ములును నసమానగణికలను బోలెనుండు
శాంకరీ విద్యయొకటి యీజగతిలోన
గుప్తమై కులస్త్రీ వోలెఁగొమరు మిగులు. ౪౮

ఈకవిచారిత్రమును ముగించుటకుబూర్వము పేరు తెలియని యొకకవిజీవితము నిటఁ జెప్పవలసియున్నది. భైరవాచార్యపుత్త్రి డగు మనుమంచిభట్టునతఁడు హయలక్షణవిలాసమనుకావ్యమును రచియించెననికవిచరిత్రకారులు వ్రాసియున్నారు. ఆగ్రంథతాళపత్రప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునను, రాజమహేంద్రనరమునందలిగౌతమీగ్రంథాలయమునను గలవు. ౧౯౨౯ వసంవత్సరమున నీగ్రంథము ముద్రితమైనది. ఈముద్రితప్రతిలోను దాళపత్రప్రతులలో నుగూడ నిరువురుకవులు రచించిన రెండుగ్రంథములు మిళితములైయున్నవి. ఒకటి హయలక్షణవిలాసము, వేఱొకటి అశ్వలక్షణసారము. ముద్రితప్రతిలో శీర్షిక అశ్వలక్షణసార మనియున్నది. గద్యలో హయలక్షణవిలాస మనియున్నది. కొన్నితాళపత్రప్రతులలో నీగ్రంథము అధికారములుగా విభజింపఁబడియున్నవి. ముద్రితప్రతులలో నంకుర

ములుగా భాగింపఁబడినది ఈరెండుగ్రంథములను రచించినవారిలో నొకఁడు మనుమంచిభట్టు. రెండవవాని పేరు తెలియదు. మనుమంచి భట్టుగ్రంథకృతిపతి కంపభూపాలుఁడు. రెండవగ్రంథకృతిపతిగన్నయా మాత్యుఁడు. గన్నయకృతినందిన గ్రంథములోని:

క. నాలుగుకాళ్ళుం గొనచెవి
నాలము వదనము విశాలవక్షము తెలుపై
కాలునది యష్టమంగుళి
నేలినపతి యేలు ధరణినేలినపతులన్.

అనుపద్యమును శాలిహోత్రములోనిదని మడికిసింగన తనసకల నీతిసమ్మతమునను దాహరించియుండుటచే నీగ్రంథముసింగనకవికంటెఁ బూర్వము రచియింపఁబడినది. కంపభూపతికంకితమైన రెండవగ్రంథము క్రీ శ ౧౪౨౦ ప్రాంతమునాఁటిది.

ముద్రితప్రతిలో రెండుగ్రంథము లిమిడియున్నవని చెప్పుటకుఁ గొన్నిపద్యములలో "గన్నయభూపా !" యనిసంబోధనముండుటయుఁ గొన్నిపద్యములలో "సాళువకంపా" ఇత్యాదిగా కంపభూపతిసంబోధనము లుండుటయు నిదర్శనములు. ఇంతేకాదు. ప్రథమాంకూరములో:—

క. ఉరమున నుపరంధ్రంబుల
శిరసున రంధ్రంబులందుఁ జెలువుఁగ రెండే
నరయఁగ నుదుటను మూఁటిని
బరువడి యొకటొకటియున్నఁ బదిధృవులయ్యెన్.

అనుపద్యములోనిభావమ్మునే ద్వితీయాంకురములో

క. ఉరమున శిరమున రంధ్రో
పరంధ్రములు రెండు ప్రస్థానములో

నుత్తరమున నొకటొకటిగ
వరవాజులపై నీదశవరధృవులయ్యెన్.

అనుపద్యములోఁ జెప్పఁబడియుండుట చేతను, ఇశ్లేషప్రథమాంకురములోని భావము లేమఱికొన్ని ద్వితీయతృతీయాంకురములయందుండుటచేతను, నివి రెండు గ్రంథములని నిర్ణయింపవలసియున్నది. ప్రథమాంకూరమున మొదటియఱువది రెండుపద్యములలోను గంపభూపతిసంబోధనము లేదు. తక్కిన గ్రంథములో గన్నయసంబోధనము లేదు. ౬3 వ పద్యము:—

క. శ్రీజన్మసదనరాజ
వాజిత యుపమానవయన రాజీవునకున్
రాజునకు దుగ్ధవారిధి
రాజునకున్ కుమారకంపరాజున కెలమిన్.

అని షష్ఠ్యంతముగానున్నది. దీనితరువాత ౬౪ వ సంఖ్యగా "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పఁ బూనిన హాయలక్షణవిలాసంబను కృతికిఁ గథావిధానం బెట్టిదనిన..." ఇత్యాది వచనమున్నది

దీనినిబట్టి ౬౨ వ పద్యమువఱకును నొకగ్రంథమనియు దానితరువాత నున్నది వేఱొకగ్రంథమనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈ రెండవగ్రంథమునకు హాయలక్షణవిలాసమని పేరు. దీనిని మనుమంచిభట్టు రచియించెను. దీనిని గూర్చి మనుమంచిభట్టుచరిత్రమున వ్రాయుదును. దీనియందు దాదాపు ౧3౦ పద్యములున్నవి.

ఇఁక మొదటిగ్రంథమును గూర్చి యాలోచింతము. ఇందు౬౨ పద్యములే యుండుటచే నిదిసంపూర్ణగ్రంథము కాదనియు మఱికొన్ని పద్యములుగల ప్రతి యుండవలయుననియుఁ దోఁచుచున్నది. హాయలక్షణవిలాసముకూడ సంపూర్ణముగా ముద్రింపఁ బడలేదు. ఆవిషయమునుగూర్చి మనుమంచిభట్టు చరిత్రమున వ్రాసెదను.

మొదటిగ్రంథము పేరేదియో తెలియదు. దీనినుండియే మడికి సింగనకవి యొకపద్యమును గ్రహించి దానికి "శాలిహోత్రము" అని పేరిడినాఁడు కావున నీగ్రంథనామము "శాలిహోత్రము" అనియే వాడుదము. ఈగ్రంథమందలి రెండవపద్య మిది:—

చ. అనఘుఁడు శాలిహోత్రుఁడు హయంబులకున్ మునుజెప్పినట్టియా
యనుపమలక్షణంబులు వయఃపరిమాణము రోమజంబులన్
దెనుఁగున నెల్లవారలకుఁ దేటపడన్ రచియింతు సత్కవుల్
విని కొనియాడ దానగుణవిశ్రుత గన్నయ మేదినీశ్వరా!

ఈపద్యమునుబట్టి శాలిహోత్రునిగ్రంథము ననుసరించిన దగుటచే దీనికి "శాలిహోత్ర" మనియే గ్రంథకర్త నామకరణము చేసెననియు "అశ్వలక్షణసారము" అను పేరును వ్రిలేఖకులో ముద్రాపకులో నుంచిరనియుఁ దలంపవచ్చును. ఈపద్యములో లక్షణములును వయఃపరిమాణమును సుడులును జెప్పఁ దలంచినట్లు కవి చెప్పియున్నాఁడు. ఈగ్రంథమందలి ౬౨ పద్యములలోను, నీమూఁడువిషయములును క్లుప్తముగా నున్నవి. కావున నిది సంపూర్ణ గ్రంథమని యెంచిన నెంచవచ్చును.

ఈపద్యములోని గన్నయయను పదమును గంపయయనిమార్చి యాంధ్రకవుల చారిత్రమునఁ బ్రకటించియున్నారు. తక్కిన గ్రంథముతో ననుగుణముగ నుండుటకై శ్రీవీరేశలింగము పంతులుగా రీమార్పును గావించియుందురు. ఇంకననేకతావుల గన్నయయనుశబ్దముండుటచే దీనినిమార్పరాదు. ఈశాలిహోత్ర గ్రంథకర్తయెవ్వరో తెలియదు. తెలిసికొనుట కాధారము లిప్పటివఱకు నాకులభింపలేదు.

ఇఁకఁగృతిపతినిగూర్చి యాలోచింతము. శాలిహోత్రమునఁ గృతిపతిని నీక్రిందివిధముగా సంబోధించియున్నాఁడు.

౧ గన్నయమేదినీశ్వరా! ౨ గన్నవసుధాధీశా! 3 గన్నదండాధినాథ! ౪ అరిబలభేదీ! ౫ గన్ననృపతీ! ౬ గన్నభూప! ౭ దండనాయకతిలకా! ౮ మల్లయామాత్యపుత్ర నిర్మలచరిత్ర: అహితహృద్భల్ల: రాయసాహత్తిమల్ల ౯ ప్రభుసుత భీమాంబపుత్ర! పరమపవిత్రా! ౧౦ కొంకణపతియిభరిపుశౌర్యా.

వీనినిబట్టి గన్నయ దండాధి నాథుఁడనియు, మల్లయామాత్య భీమాంబలకుఁ బుత్త్రుఁడనియుఁ గొంకణపతియనియు, రాయసాహత్తిమల్లబిరుదాంచితుఁ డనియుఁ దెలియుచున్నది. గన్నయలు పెక్కురున్నారు. మడికిసింగన కవికృత పద్మపురాణ కృతిపతి యగు కందనామాత్యుని పూర్వుఁడొక గన్నయ కలఁడు కాని యతనితల్లిగౌరాంబ. అందుచేనాతఁ డీతఁడు కాఁడు. మారనకవికృత మార్కండేయపురాణ కృతిపతిగన్నయయున్నాఁడు కాని యాతఁడు బ్రాహ్మణుఁడు కాఁడు.

కొలను గణపతిదేవుని పూర్వులలో గన్నయలున్నారు. ఇందు కొఱకుఁ బైనవ్రాసిన వంశవృక్షము నొకసారి పరికింతము. ఇందుఁ గనుపడుచున్న గన్నయలలో మనకుఁ గావలసినగన్నయ లేఁడు. కాని, పినమల్లదేవుఁడున్నాఁడు. ఇతఁడే మల్లయామాత్యుఁ డనియు, నితని భార్యభీమాంబ గావచ్చుననియు, వీరికుమారుఁడే శాలిహోత్రకృతి పతియగుగన్నయయనియు నాయభిప్రాయము. పెదమల్లవిభుని కుమారుఁడు పెదగన్నభూపతి వంశవృక్షములోఁ గనుపడుచున్నాఁడు. పినమల్లదేవునికుమారుఁడు పినగన్నభూపతి యుండుటవలననే యాతనిని పెదగన్నభూపతియనివాడఁ జొచ్చిరనియు, వీరు కాకతీయుల యొద్ద దండాధిపతులయినను భూపతులనియు మేదినీశులనియు నృపతులనియుఁ బిలువఁబడిరనియుఁ దలంపవచ్చును. సాహత్తిమల్లబిరుద మీ వంశీయులకున్నట్లు పైనివ్రాసిన పద్యములవలనఁ దెలియుచున్నది. కొంకణదేశము నిజామురాష్ట్రము లోనిది. పినమల్లదేవుఁడు కాకతి రుద్రదేవునియొద్ద దండనాయకుఁడుగా నుండినట్లు పైనివ్రాసిన తరలపద్యములో నున్నది. ఈతనికుమారుఁడును దండనాథుఁడై రుద్రదేవమహా

రాజుకడనో యాతనితరువాత కాకతి గణపతిదేవునియొద్దనో, దండాధిపతియై కొంకణదేశపాలనమున నియమితుఁడై యుండును. శాలిహోత్రమునందలి వర్ణనాంశములన్నియు నీతనికిసరిపోయినవి. కావున సాధనాంతరము లభించువఱకును శాలిహోత్రకృతిపతి పినమల్లామాత్యుని తనయుఁడే యనిపల్కవలయు నితఁడు. గ్రంథకర్తవాము మెఱుంగరాకపోవుటచేత నీవిషయము నంతయు నిట వ్రాయవలసి వచ్చినది.

---

## 67. వెన్నెలకంటి అన్నయ్య

ఇతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. హారితసగోత్రుఁడు; అన్నయామాత్య పౌత్రుఁడు; సూరామాత్య పుత్త్రుఁడు.

ఇతఁడెనిమిదాశ్వాసములు గల షోడశకుమారచరిత్ర మను నుత్తమ ప్రబంధమును రచియించి తనతండ్రియైన సూరామాత్యున కంకితము చేసెను. ఈగ్రంథకృత్యాదియుఁ దృతీయ, చతుర్థాశ్వాసములునులభింపలేదు. తక్కినభాగము ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటితమైనది. ప్రథమాశ్వాసమున నచ్చటచ్చటఁ గొంతభాగము శిథిలమైపోయినది.

కృత్యాది లేకపోవుటచే నీకవిచారిత్రము తెలియుటలేదు. ఆశ్వాసాద్యంతపద్యములును గద్యయు నీతనిచరిత్రకాధారములు. వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

మ. జగదానందవిహార! హారమకుటచ్ఛత్రాదిసంపన్న! ప
న్నగభూషార్పిత భావ! భావజకళానైపుణ్య! పుణ్యక్రియా!
సుగమాచారగభీర! భీరహితతేజోదీవ్యమానక్షమా!
గగనాభోగదిశాంత! శాంతమదరాగద్వేషదోషోదయా!

క. ఆఖ్యానకల్పితకథో
పాఖ్యానాఖ్యాయికా ప్రపంచరహస్య
వ్యాఖ్యానవ్యవహారణ
ప్రఖ్యాతచరిత్ర! వికచపంకజనేత్రా!

మా. శమదమగుణమోదీ! శైవసిద్ధాంతవేదీ!
సముచితనయబుద్ధీ! సంచితైశ్వర్యసిద్ధీ!
యమనియమధురీణా! యజ్ఞకర్మప్రవీణా!
శమితదురితవేగా! సాధితాష్టాంగయోగా! ౧ ఆ.

క. శ్రీమద్విరించితరుణీ
కోమలవీణా నినాదకూలంకష వా
గ్భామాభిరామ! సుకవి
స్తోమనుతౌన్నత్య! యన్నసూరామాత్యా!

శా. తారానాయకబింబరత్నకలశీధారాళ నిర్యత్సుధా
సారాభ్రంకష దుగ్ధవార్ధిలహరీసంతానవిత్యప్రభా
పారంపర్యపరాభవారభటికప్రాగల్భ్యభాస్వద్యశో
హారశ్రేణిపరిష్కృతాఖిల దిశాహస్తీంద్రకుంభస్థలా!

క. శ్రీరామాయణ భారత
పారాశరసూక్తి కూర్మపద్మప్రముఖా
సారపురాణవిలోచన
గౌరవమతిధన్య! మంత్రిగణమూర్ధన్యా!

మా. శరదమృతమయూఖ శ్లాఘతేజోమయాంగా!
హరిహరపదపద్మధ్యాన ధన్యాంతరంగా!
నరపతినయ విద్యానర్తకీనాట్యరంగా!
పరబలతిమిరాళీ భంజనోద్యత్పతంగా! ౨ ఆ

క. శ్రీచరణాంబుజసేవా
వైచిత్రీనిరత! శివమంవర్గమహా ,శ్రీ,

పారిచర్యమూల కరుణా
సూచితమాహాత్మ్య! యన్నసూరామాత్యా!

శా. ఆపస్తంబపవిత్రసూత్ర! హరితఖ్యాతాన్వవాయామృతా
కూపారామరభూజ! భక్తివినతక్షోణీశచూడామణీ
దీపారాధితపాదపీఠ ధరణీతేజః ప్రతిష్ఠాపన
వ్యాపారావత! షట్సహస్రకులచూడాకల్పరత్నాంకురా!

క. మరకతమౌక్తికవిద్రుమ
కురువిందమహేంద్రనీల గోమేధిక వి
స్ఫురితమణి ఖచితభూషణ
పరితోషణ సుకవిలోక! భవ్యవివేకా!

ఉత్సాహ. బంధురప్రబంధ బంధభవ్య నవ్యభాషణా!
సింధుసమగభీరతా విశేషనిత్యభూషణా!
సింధురాత్తప్రచుర తురగ సేవ్యవాజిశిక్షణా!
బంధుమిత్రసుకవి నికరపాలనా విచక్షణా! ఆశ్వా

క. శ్రీహర్షముఖ్యసుకవిస
మాహితకావ్య ప్రపంచమాధుర్యసుధా
గాహన లీలారసిక
వ్యాహారవిహార! మంత్రియన్నయసూరా!

ఉ. భట్టియుగంధరాది నరపాలకమంత్రిమహాప్రవాహసం
ఘట్టనధీధురంధర! వికారవిదూర! విలాసబంధురా!
పట్టపటావళీకనకభద్రమదావళ భూరిభూషణా!
రట్టజవాజిరత్న నికరక్రమ పూజిత కాలకంధరా!

క. శారదనీరద నారద
పారదబిసశారదాబ్జ భాసిత్వరియశః

పూరఘనసారపూరిత
సారసగర్భాండభాండ సదవనశౌండా!

మందారదామము. సంగీతసాహిత్య సారస్యలోలా!
శృంగారలక్ష్మీవశీకారలీలా!
అంగాధిపౌదార్య హారిప్రదానా!
అంగీకృత శ్రీమదాదిప్రధానా! ఆ ౬

క. శ్రీభార్గవ కామందక
వైభావసమోపధార్య! వాసవమంత్రి
ప్రాభవ విడంబధీగుణ
శోభితషాడ్గుణ్యా! యన్నసూరవరేణ్యా!

మ. సరసానందన సత్కళాగమపరీక్షాకృష్ణకందార। భా
స్వరనానారసభావ నిర్మథనభోజక్ష్మాప! విద్యానిరం
తరగోష్ఠీజగదేకమల్ల! బహుశాస్త్రగ్రంథ సిద్ధాంతవి
స్తరవిజ్ఞానకవిత్వకావ్యకలనా సర్వజ్ఞసోమేశ్వరా!

క. వీణావాదన చలదలి
వేణీవేణీప్రసూన విహరన్మధుప
శ్రేణీగానాకర్ణన
ఘూర్ణీకృతనేత్ర। హారితగోత్రపవిత్రా! ౭ ఆ

క. శ్రీభాసమాననానా
వైభవజయలాభ......వనితాంత
స్వాభా.. త సౌరభ
శోభితపాండిత్య! యన్నసూరామాత్యా!

ఉ. ... ... ... ... ... ... ... ... ప్రతిమానదాన వి
ద్యామహనీయవైభవ కృతార్థిత సత్కవిరాజమత్సరో
ద్దామవిరోధిమంత్రి జనతాదృఢమంత్ర రహస్య
... ... ... ... ... ... ... ...

క. ... ... ... ...

నాటకముఖగోహళాది నాట్యరహస్యో
ద్ఘాటనిపుణ! ప్రజ్ఞా
పాటనచాతుర్య! నూత్నభరతాచార్యా! ౮ ఆ

ఈపద్యములనుబట్టికవితండ్రియైన,సూరామాత్యుఁడుసంస్కృత నైషధాదికావ్యములను, బద్మకూర్మాది బహుపురాణములనుబఠించి సారమెఱింగిన వేత్తయనియు, శిష్యులకుఁ బాఠములు చెప్పుచుండెడి వాఁడనియు, నాట్యశాస్త్రమునఁ బ్రవీణుఁ డనియు, సంగీతసాహిత్యములయం దపారపాండిత్యము గలవాఁ డనియుఁ దెలియుచున్నది. సరసమైన కవిత్వముచెప్పఁ గలవాఁ డనుటకుఁ దగినవాక్యములు పైపద్యములలోఁ గలవు. కాని యాతఁడు రచించిన గ్రంథముల పేరుల నీయ లేదు. మంత్రియనుటకుఁ దగినమాటలును బైపద్యములలో నున్నవి. కాని యాతని ప్రభు వెవ్వరో తెలియ లేదు. కృత్యాదియందునుమూఁడవ నాల్గవ యాశ్వాసాద్యంత పద్యములయందును నింతకంటె విశేషము లేమయినఁ గలవేమో తెలియదు.

కవికాలమునుగూర్చి పరిషత్తువారు పీఠికలో నిట్లు వ్రాసి యున్నారు.

"ఇందుఁగవితనకృపతిభర్తయగునన్నయ్యను,కృష్ణకందార,భోజ జగదేకమల్ల, సోమేశ్వరులతోఁ (7-128) బోల్చి యున్నవాఁడు. భోజుఁడు ధారానగరాధిపతి. జగదేకమల్లుఁడు పశ్చిమచాళుక్యచక్రవర్తి. వీరు పదునొకండవ శతాబ్దమువారు. సోమేశ్వరుఁడు భూలోక బిరుదాంకితుఁ డగు పశ్చిమచాళుక్యచక్రవర్తి. (A.D.1126–38)ఇతఁడు సంస్కృతమునఁనభిలషితార్థచింతామణియను మానసోల్లాసమును రచించెను. ఇతనికి సర్వజ్ఞభూపుఁ డను బిరుదుకలదు. కృష్ణకందారుఁడు యాదవరాజు. జైత్రపాలునితనయుఁడు. పదుమూఁడవ శతాబ్దమున సూక్తిముక్తావళికర్తయగు జల్హణకవిని వేదాంతకల్పతరు-కర్తయగు

నమలానందుని బోషించెను. కాన నీగ్రంథము పదుమూఁడవ శతాబ్దానంతరము రచియింపఁ బడియుండును."

దీనినిబట్టి పదునాల్గవశతాబ్దియో, లేక యింకను దరువాతనో కవికాలమని పీఠికాకారుల యభిప్రాయమనుటస్పష్టము. 1949వ సంవత్సరము మార్చినెల 30 వ తేదీగల యాంధ్ర పత్రికయందు "విద్యారత్న" పండితులీ యన్నయకవి, యాంధ్రకవితరంగిణి మూఁడవ సంపుటమునఁ జేర్పఁదగినవాఁడని యభిప్రాయ మొసంగిరి. కాని వారందులకు హేతువులను జూపలేదు.

విష్ణుపురాణమును రచించిన వెన్నెలకంటి సూరయామాత్యుఁడీగ్రంథకృతిపతి యనుట పొసఁగదు. ఆసూరయామాత్యుని తండ్రి యమరయ్య. ఈసూరయ్య జనకుఁడు అన్నయ. విక్రమార్క చరిత్ర యందు జక్కయకవిచే:

ఉ. వెన్నెలకంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
　పన్నుఁడు రెడ్డివేమ నరపాలకుచేత మహాగ్రహారముల్
　గొన్నకవీంద్రకుంజరుఁ డకుంఠిత తేజుఁడు పెద్దతండ్రిగా
　నన్నుతిఁ గన్నసిద్ధనకు సంతతదానకళావినోదికిన్.

అనుపద్యమునం దుదాహృతుఁడైన సూరయ నొకనిని మన మిది వఱ కెఱుఁగుదుము. కాని యాసూరయయే షోడశకుమార చరిత్ర కృతిపతియని నిశ్చయించుటకుఁ బై నివ్రాసినయాశ్వాసాద్యంత పద్యములలో వేమారెడ్డి విషయముగాని అగ్రహారముల మాటగాని సూచనగానైన లేకపోవుటచే నవకాశములేకున్నది. ఆతఁడే యాతఁడైనచో నావిషయమిందు తప్పక యుండియుండును.

అనపోతారెడ్డి కాలమునందలి వెన్నెలకంటి వారిని గూర్చి చెప్పిన:

ఉ. ఈనిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
　ణీనది సాక్షిగా నని నిల్చినరావుతు గేసభూవిభుం

గానకుఁదోలి వెన్నడిచి కాచిన వేమయయన్న. వేమభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటి వారిలోన్.

ఆనుపద్యములోఁ బేరు లేకుండుటవలన యన్నయకాలమును నిర్ణయించుటలో నాపద్యము మనకుఁ దోడుపడుటలేదు. అన్నయ వంటి కవులాకాలమున సత్ప్రబంధములు రచించినవారు మఱికొందఱుండవచ్చును. రాజేంద్రచోడునిచే నిద్దనపూడి నగ్రహారముగాఁ బడసినసూరనసోమయాజి యొకఁడున్నాఁడు. కానియాతఁడీయన్నయ కంటెఁ జాలపూర్వుఁడు. కావున నాతఁడీతఁడు కాఁడు.

నేనెఱింగియున్నంతవఱకు వెన్నెలకంటివారినిబట్టి యీ కవి కాలమును నిర్ణయించుట కవకాశము లేకపోయినది. ఈకవిరచించిన కృత్యాది లభింపకపోవుటచేఁ గాలనిర్ణయము దుస్సాధ్యమగుచున్నది. ఇతని నితరకవులెవ్వరు నుతింపలేదు. షోడశకుమారచరిత్ర సప్తమాశ్వాసాంతపద్యమునుబట్టి యాదవరాజగు కృష్ణకందారుని యాస్థానకవియైన జల్హణుఁడు రచించిన సూక్తిముక్తావళి గ్రంథాంతమున నాగ్రంథరచనాకాలము "శాకేజాగ్నిదిశ్వరపరిమితే" అని చెప్పియుండుటచే, క్రీ. శ. ౧౨౫౭ ప్రాంతమునందున్నకృష్ణకందారునిదన తండ్రితోఁ బోల్చియుండుటవలన, నంతకుఁ దరువాత నీతఁడున్నాఁడనుటనిశ్చయము. కానియాతరువాత నెంతకాలమున కీతఁడున్నాఁడో నిశ్చయింపలేము. ఒకశతాబ్ది తరువాత నున్నాఁడనినచో నీతఁడు శ్రీనాథునకించుక పూర్వుఁడో సమకాలికుఁడో యగుచున్నాఁడు. ఈకవికాలమును నిర్దిష్టముగ నిర్ణయించుటకుఁ బ్రస్తుతమున నింతకంటె నాధారములు నాకులభింపలేదు. ప్రస్తుతమీతనిని శ్రీనాథునితో సమకాలికుఁ డనుకొందము.

పింగళి సూరనార్యుఁడు రచించిన ప్రభావతీప్రద్యుమ్నమునకును షోడశకుమారచరిత్రములోని షష్ఠాశ్వాసమునందలి కథకును గొంతపోలిక కలదు. ప్ర. ప్రద్యుమ్నమందలి హంసవంటిది

షో. చరిత్రమున నొకచిలుకకలదు. ఆహంసకును నీచిలుకకును గురువు భారతియే. ఆహంస సామర్థ్యమును సూరనార్యుఁడు:—

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెన్ గడుపూర్వపక్షములు జోకంబెంచుచున్ బెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దుదిన్ సిద్ధాంతము ల్నిల్పుచున్.

మఱియును

తే. కావ్యనాటకాలంకార గానమదన
శాస్త్రపరిచయమహిమంబు జాలపాద
భామినీమణి నెఱపె నుద్దామపటిమ
నాయసురభర్త మెచ్చి ప్రహరే యనంగ.

ఇత్యాదిగా వర్ణించియున్నాఁడు.

అన్నయకవి తనచిలుకపాండిత్యమును:

సీ. అష్టభాషల మధురాశువిస్తరచిత్ర
కవితలఁ జెప్పఁ సత్కవులు మెచ్చ
నామ్నాయములు నాల్గు నంగంబులాఱును
నఖిలశాస్త్రంబులు నవగతములు
నూతనరీతుల ధాతువిభ్రమముల
రసములు మెఱయ వర్ణకము వాడు
నేపురాణంబుల నేకథ యడిగినఁ
దడఁబాటు లేక యేర్పడఁగ జెప్పు

నోలి నవధానములు వేనవేలు సూపు
శబ్దవిజ్ఞానినైనను సరకు గొనదు
గౌతమునినైన తర్కమునఁ గెలుచు
నవధరింపు మీకీరంబు నవనినాథ!

సూరనార్యునినాయిక ప్రభావతి. అన్నయార్యునినాయిక హంసావళి. ప్రభావతిని మన్మథుఁడు సృష్టించెనేమో యనిసూరన:—

ఉ వెన్నెలతేటనిగ్గు నరవిందపుఁదేఁకుమృదుత్వముం బదా
ర్వన్నెయజాళువాపసిఁడిరంగు మెఱుంగులధాళధళ్యమున్
గన్నెయరూపుగాఁ గరువుగట్టిమనోజుఁడు పోఁతఁబోయఁబో
లు న్నెఱనేర్పుతో ననుట లోకుల పల్కది చాలదేమియున్.

అని యుత్ప్రేక్షించినాఁడు. అన్నయహంసావళిని అట్లే మన్మథుని సృష్టియని:—

సీ. నెలచందురునికాంతి నెమ్మోముసృజియించి
యకలంకవిలసనం బలవరించి
కలువరేకులమించు కన్నులు గావించి
నిత్యవికాసంబు నెలవు కొలిపి
చక్రవాకవిభూతిఁ జన్నులుగల్పించి
పాయనియొప్పులు పరఁగఁజేసి
కరికుంభవిస్ఫూర్తిఁ గటిచక్రి మొనరించి
కొమరారు నునుజిగి గుదురుగొలిపి
వనజభవుసృష్టి నిచ్చఁ గైకొనక తాన
మీనకేతుండు వేడ్క నిర్మించెఁ గాక
మూడుజగములఁ గలుగుపూఁబోఁడులందు
మాళవేశ్వరకన్యకఁ బోలఁ గలరె?

ప్రద్యుమ్నని రూపమును, పార్వతి చిత్రఫలకమున వ్రాసి ప్రభావతికి స్వప్నమువనిచ్చినది. హంస యారూపమును బోల్చి చూచి, ప్రద్యుమ్నుఁ డని తెలిపినది. ఇట నాయకుని రూపమును నాయిక విహరించు నాట్యమండపమందలి కుడ్యభాగంబునఁజిలుకయే వ్రాసి, యారూపము గలపురుషుఁడున్నాఁడా? యనినాయిక ప్రశ్నింప నాయకుని రూపురేఖలు వర్ణించి యాతనివృత్తాంతమును దెలిపినది.

ప్రద్యుమ్నుఁడు. వజ్రనాభునకును బ్రభావతికిని సరిపడినట్లు పలికిన రెండర్థములుగల:—

చ. సకలవిశేషశోధనకుఁజాలిన యోా నెఱజాణ! వజ్రనా
భ కులవతంసరత్నమ! ప్రభావతిరోహితకంటకంబ తా
వక మగుచూపు నాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వెఁగాన న
త్యకలుషవృత్తి నాసుకృతమంతయు నేఁడుసుమిాఫలించుటల్

అనుపద్యమును సూరనార్యుఁడు రచించినట్లే రెండర్థముల నిచ్చు పద్యమొకదానిని యన్నయార్యుఁడును రచించి, నాయికచే నాయకునకు చిలుకమూలమున నంపించినాఁడు. కాని దురదృష్టవశమున నాపద్యము గ్రంథపాతము.

కవిత్వమునఁ బోలికయంతగా లేకున్నను నితివృత్తమునసామ్యముండుటచే నిం దెవ్వరైన నొకరు మరియొకరి ననుకరించిరా యని సంశయము కలుగుచున్నది. అన్నయ, సూరనార్యు ననుకరించెనేని, యతఁడు పదునాఱవశతాబ్ది వాఁడగును.

ఎట్లయిన అన్నయకవికాలమునుగూర్చి యింకను బరిశోధింపవలసియున్నది. ఈతనికవిత్వమునుగూర్చి వీరేశలింగము పంతులుగారు లిట్లువ్రాసియున్నారు.

"ఈకవి దశకుమారచరిత్రమును మనస్సున నుంచుకొని యీ షోడశకుమార చరిత్రమును రచియించెను. కొన్నికథలను గథా సరిత్సాగరాదులనుండి సంగ్రహించి తనకవితా చమత్కృతిచే రస పుష్టిని వర్ణనాధిక్యమును గలిగించి జనమేజయుని రెండవకుమారుని గథానాయకునిగఁ జేసి యాతనికిఁ దోడుగ నతనిమంత్రితనయులను, బురోహితపుత్త్రులను, దండనాథసుతులను బదేనుగురను గూర్చి కథ సాగించినాఁడు.

కవిత్వము నిర్దుష్టమైనది. ఉభయభాషాప్రౌఢి మెఱయుచున్నది. శైలి మంచనకేయూరబాహుచరిత్రమును, జక్కన విక్రమార్కచరిత్రమును, కేతనదశకుమారచరిత్రమును బోలుచుండును. పద్యములు హృద్యములై ధారాశుద్ధి కలవిగానున్నవి."

అన్నయకవి కవిత్వశైలి తెలియుటకై ఆశ్వాసమునకొకపద్యము నిట నుదాహరించుచున్నాఁడను.

చ. అమరులకంటెఁ దత్పురిధరామరవల్లభు లెక్కుడంట త
థ్యము తలపోయ నాగమవిధానములై తనరారు తారు ని
త్యమునొనరించుదానముల యజ్ఞములంబరితృప్తిఁబొంది సం
భ్రమమునఁ దేలివారువడిఁ బ్రస్తుతిసేయఁగఁ బెంపుఁ జెందుటన్. ౧అ

ఉ. లాలితరూపయౌవనవిలాస మనోహరమై తనర్చు నీ
లాలకనిద్రవోవఁగని యాదటఁగౌఁగిట మేలుకన్పఁగాఁ
జాలక యాత్మఁదక్కిన విచారములొందఁగ నూరకుండు నా
కూళుఁడు కామరాజ్యమునకు న్వెలిగాఁడెతలంచి చూడఁగన్. ౨అ

మ. తరుణీ! నీసుతుఁబెట్టిలోనిడి నృపద్వారంబునం బెట్టు మె
వ్వఘనుంగానకయుండ నిప్డుచని లేవంగాంచి సూర్యప్రభుం
డురు తేజంబున వానిఁజూచి మదిలోనుప్పొంగుచుం బుత్రుఁగా
నిరవద్యోత్సవలీలమైఁ బెనుచు వీని న్నాదుదివ్యాజ్ఞమై ౩అ

శా. ఏచందంబున నబ్బునో యబలయం చేనాత్మనూహింపఁగా
నాచాటప్పుడు నాదుకర్ణముల కత్యానంద మొందించిన
న్వాచాలత్వ మెలర్ప హేమపురమున్వర్ణించి యేఁగంటినం
చాచంద్రాస్యవరించు వాఁడనిది కార్యంబంచు ధైర్యంబునన్. ౪అ.

ఉ. ఈసరసోక్తులీమహిమ యీయవికారత యీవిలాసమీ
రాసిరి యీయుదారత ధరావరులెవ్వరియందుఁగల్గునే

యేసుకృతంబుచేసిన హృగేక్షణ కబ్బునొ భూతలంబుపై
నీసాబగుండు నాథుఁడుగ నింపులఁదేలెడు నిత్యధన్యతల్. ౭౫

చ. హరునిటలాగ్ని రూపఱియు నంగజుఁడప్పుడపుట్టె రాఘవే
శ్వరుఁడు శపించినంబికరవంబులు గ్రమ్మరఁగల్గె రాహు ని
ష్ఠురగతిఁబట్టి మింగినను సోముఁడు వెల్వడివచ్చెఁజెల్లఁబో
విరహులఁబొందియున్న శనివీడియు పీడవ యేమి సేయుదున్. ౭౬

ఇట్టిదే వేములవాడ కవి ద్వాదశరాజ చరిత్రమను ప్రబంధమును రచియించెనఁట.



## 69. అనంతామాత్యుఁడు

ఇతడారువేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. తిక్కనామాత్య పుత్రుఁడు. ఇతనితాత ముమ్మడన్న. ముత్తాత బయ్యనకవి. తల్లిమల్లమ; పితామహి ఎఱ్ఱమ; ప్రపితామహి పోలమ

ఈకవి భోజరాజీయమను ప్రబంధమును, రసాభరణమనులక్షణ గ్రంథమును ఛందోదర్పణ మనుఛందశ్శాస్త్రమును రచించియుండెను.

ఇతని ముత్తాతయైన బయ్యనామాత్యుఁడు కవియై మహాభారత కృతికర్తయగు తిక్కనసోమయాజిచేత "భవ్యభారతి" యను బిరుదము నందినట్లును కవియేగాక దండనాథుఁడై పేరువడసినట్లును భోజరాజీయమందలి యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. క్షితిఁ గ్రతుకర్తనా వినుతిచేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవి నాయకుఁడాదట మెచ్చి భవ్యభా
రతియనఁ బేరుగన్నకవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే

చ. శరధిసుతన్వరించుజలజాతవిలోచనుమాడ్కి శీతభూ
ధరజఁబరిగ్రహించు హిమధామకళాధరుపోల్కి సద్గుణా
భరణపవిత్రమూర్తి కులపాలికనాఁదగు పోలమాంబికన్
బరిణయమయ్యె నెయ్యమునఁబయ్యచమూపతి వైభవోన్నతిన్.

ఈబయ్యనకవి రచించినగ్రంథములేవియో, యితఁడేరాజుకడ దండనాయకుఁడుగ నుండెనో తెలియలేదు. ఈబయ్యనమంత్రికి గంగనమంత్రి, ముమ్మడన్న యను నిరువురు తనయులు గల్గినట్లును నందు ముమ్మడన్నకుఁ దిక్కన, సింగన యను నిరువురు కుమారు లుదయించినట్లును నీక్రిందిపద్యములలోఁ గవి చెప్పియున్నాఁడు.

చ. గుణయుతు లవ్వధూవరులకు జ్జనియించిరి త్రేత రామల
క్ష్మణులయి పుట్టి ద్వాపరయుగంబుతుదిందగ రామకృష్ణులై
గణనకునెక్కి యీకలియుగంబున నిట్లుదయించె లోకర
క్షణుఁడగు విష్ణుదేవుఁడన గంగనమంత్రియు ముమ్మడన్నయున్.

చ. కడిమిఁగిరీటిదానమునఁ గర్ణుఁడు భోగమున న్సురేంద్రుఁ డా
కృుడువిభవంబునన్ హరి యకుంఠితబుద్ధి బురందరేజ్యుడున్
గడువగుధీరతన్ సురనగప్రవరుం డనఁబోలమాంబ ము
మ్మడి బెడఁగొందు రూపమహిమన్మరు ముమ్మడియై జగంబునన్.

క. ఆముమ్మడి ప్రెగ్గడ శ్రీ
రాముడు సీతనువరించుక్రమమున సుగుణ
స్తోమాభిరామ నమితక్రి
యామండిత నెఱ్ఱమాంబఁ బరిణయమయ్యెన్.

క. ఆరమణీమణులకుఁబ్రి
భారమ్యుఁడు తిక్కవిభుఁడు బ్రికటితకాంతి
స్ఫారుండు సింగనయునను
వారలుపుట్టిరిలఁ బుష్పవంతుల మాడ్కిన్

ఈతిక్కనయే, అనంతామాత్యకవితండ్రి. ఈతిక్కనామాత్యుడు పెరుమగూరి నివాసియనియు శ్రీకాకుళమున నందలియాంధ్ర దేవుని భక్తుడనియు అక్కదండాధినాథుని కుమార్తెయైన మల్లమాంబను బరిణయమాడెననియు నీక్రిందిపద్యములలో గవి చెప్పియున్నాడు.

సీ. విలసితంబగు కృష్ణవేణీమలాపహా
రిణిభీమరథి నాధరిత్రియందు
దనరు నదీత్రయాంతర్వేదియగు పావ
నక్షేత్రమున శోభనముల కెల్ల
ధరనివాసంబగు పెరమగూరిపురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేత జెన్నొందివంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వమొంది
నెమ్మిబ్రత్యక్ష పరమపదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడితిక్కవిభుఁడు.

సీ. శ్రీవత్సగోత్రాబ్ధిశీతాంశుఁ డగునక్క
దండాధినాథుఁ డీతరుణితండ్రి
లావణ్యగుణపుణ్యలక్షణాన్వితయైన
యక్కమాంబిక యీలతాంగితల్లి
చిరకీర్తినిరతులు చిట్టనమంత్రియు
నయ్యలార్యుఁడు నాతికగ్రజన్ము
లచ్యుతాంఘ్రిసరోరుహార్చనారతుఁడు త
మ్మనమంత్రి యీయింతి యనుగుదమ్ముఁ
డనఘుఁడగు కోటకరుణాకరార్యుఁడనుఘ
నుండు ముదునూరిపెద్దవిభుండు నివ్వ

ధూమణికింగూర్మిగల మేనమామ లనిన
మగువ లెనయె తిక్కనమంత్రి మల్లమకును.

చ. చిరతరశోభనుండగు వసిష్ఠమునీశ్వరుడయ్యరుంధతిన్
బరిణయమై గృహస్థగుణభాసితుఁడై వెలుగొందుమాడ్కి గో
తరపరిరక్షణానవరత వ్రతశీలుఁడు తిక్కమంత్రి శే
ఖరుఁడు వివాహమయ్యె గుణగౌరవశోభిని మల్లమాంబికన్.

ఈతిక్కనామాత్య మల్లమాంబికల కాఱుగురు పుత్రులుద్భవించిరని చెప్పుచు నాయార్గురు నొక్కొకఁడు వేయిండ్లకు మొదలగుదురని యెంచియే పెద్దలు వీ రాఱువేలవారని నుడివియున్నారని యీక్రిందిపద్యములలోఁ జమత్కరించియున్నాఁడు.

మ. అరిషడ్వర్గముఁ దూలఁ దోలి ధరలో నైశ్వర్యషడ్వర్గమీ
వరుసన్ సంభవ మొందె నాఁగ సుతషడ్వర్గంబు జన్మించెఁ ద
త్పురుషస్త్రీతిలకంబులందు ఘనసంతోషంబు తద్బాంధవో
త్కరముం బొంద సమగ్రసంపద నిజాగారంబునం జెందఁగన్.

ఉ. భానుతకీర్తి ముమ్మడివిభుండు మదగ్రజుఁ డేను వైష్ణవ
ధ్యానసమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ నాదుతమ్ముల
జ్ఞానవిదూరు లక్కనయు సత్కవి చిట్టనయున్ వివేక వి
ద్యానిధి రామచంద్రుఁడు నుదారుఁడు లక్ష్మణనామధేయుఁడున్

క. ఈయార్వురు నొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదురని కా
దే యాఱువేల పేరిడి
రీయన్వయమునకు నేర్పుమెఱిఁగిన పెద్దల్.

ఈతఁడు రచించిన రసాభరణము, ఛందోదర్పణము అనుగ్రంథములలో గ్రంథాదిని నిష్టదేవప్రార్థనాపద్యము లొకటిరెండు తప్ప, కృత్యాదిపద్యములు లేవు. గ్రంథాంతమందలి గద్యనుబట్టియే గ్రంథ

కర్తనామమును దెలిసికొనవలసియుండును. అవి రెండును జిన్నగ్రంథములు కదాయని యవతరణిక వ్రాయలేదని తలంచుచున్నాఁడను. లేదా యవి ముద్రాపకులకు లభింపకపోయియుండవచ్చును. ఈకవి గృహనామమేదియో తెలియలేదు.

ఈకవి తనకవిత్వము పూర్వకవుల కవిత్వమువలె రుచించునో లేదోయని సంశయాకులితమనస్కుఁడై తనసమ్మత నీక్రిందిపద్యములోఁ దెలిపియున్నాఁడు.

చ. వెలయఁగఁ దొంటిపెద్దలకవిత్వమువోలె రుచించునొక్కొయేఁ
బలికెడునూత్నకావ్యరసభావము లైనను భూమిఁదల్లిదం
డ్రులకు నిజాగ్రసూనుల పటుప్రచురోక్తులకంటెఁ జిన్నబి
డ్డల వెడతొక్కుఁబల్కులు దృఢంబగు ముద్దులనీనకుండునే.

ఇతఁడు పూర్వకవిస్తుతి నిట్లుచేసియున్నాఁడు:

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ బే
రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱనమంత్రినాదిగాఁ
జన్నకవీంద్రుల న్నవరసస్ఫుటవాణు లనంగధాత్రిలో
నున్నకవీంద్రులం దలఁతునుల్లమెలర్పఁగ వాగ్విభూతికిన్.

ఈతఁడు భోజరాజీయమున గావ్యనిర్మాణకారణమును దెలుపుచు వ్రాసిన నీక్రింది సీసపద్యములో "కావ్యంయశసే అర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" అను మమ్మటాచార్యుని శ్లోకమునందలి భావమును మనోహరముగా వ్యక్తీకరించి రెండవ సీసపద్యములో నీకృతిని అహోబలనరసింహస్వామి కంకితము జేసినట్లు దెలిపియున్నాఁడు.

సీ. సకలవిద్యలయందుఁ జర్చింపఁగవితె యు
త్కృష్టమండ్రది నిత్యకీర్తికొఱకు
నర్థాప్తికొఱకు నావ్యవహారలక్షణం
బెఱిఁగెడుకొఱకు ననేకవిధము

లగునమంగళముల హరియించుకొఱకు ను
చితనిత్య సౌఖ్యసంసిద్ధికొఱకు
నొనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హితమాచరించుకొఱకు

నయ్యెఁగానఁ బెద్దలాచరించెదరంచు
నేర్పుకొలఁదిఁ గృతియొనర్పఁబూని
యస్మదీయకృతికి నధిపతిగావింప
నర్హుఁ డెవ్వఁడొక్కొ యని తలంచి.

సీ నూతనంబయ్యుఁ బురాతనకృతులట్ల
సంతతశ్రవ్యమై జరుగుననియు
నాదిరాజసమానుఁడగు భోజభూపతి
చరిత మీకవితాప్రసంగమనియు
నిందుఁజెప్పెడికథ లన్నియు నోలిఁబ్ర
శస్తధర్మోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁడగు నహోబిలనాథుఁ,
డీపుణ్యకృతికి నధీశుఁడనియుఁ

బృథివి నెల్లజనులు ప్రియభక్తియుక్తిఁ బా
టింతురనియు నూఱడిల్లి యేను
బరమసౌఖ్యమైన భవదాభిముఖ్యంబు
నెమ్మిఁబడసి యధికనిష్ఠతోడ.

ఛందోదర్పణ చతుర్థాశ్వాసమందు:

ఉ. శ్రీనిధి చక్రవర్తి గురుశేఖర పుణ్యకటాక్షలబ్ధ సు
జ్ఞానుఁడనంత ధీమణిలసన్మణి భోజచరిత్రచెప్పి ల
క్ష్మీనరసింహుఁగూర్చిన ప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగిహృద్విమలతోయజవర్తి కనంతమూర్తికిన్.

అని చెప్పియుండుటచే, మొదట భోజరాజీయమును పిమ్మట ఛందోదర్పణమును, పిమ్మట రసాభరణమును రచియించినట్లు చెప్పఁదగియున్నది. రసాభరణము శ్రీకృష్ణున కంకితమైనదని యీగ్రంథమందలి పద్యాంతములయందుఁ దఱచుగా కృష్ణాయను సంబోధన ముండుటను బట్టి చెప్పవచ్చును. రసాభరణ గ్రంథాంతమునఁ గవి యీపుస్తక రచనాకాలమును నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్యోలేందులై యొప్ప న
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమయు
క్తానామామృత వేళ నీకృతి యనంతార్యుండు సమ్యగ్రస
శ్రీనిండన్ ధ్రువపట్టణాధిపునకిచ్చెన్ భక్తిపూర్వంబుగన్.

ఇందుఁ జెప్పఁబడినకాలము హూణశకము ౧౪౩౫ సంవత్సరమున జనవరి నెల ౨౫ తేదీయైనది. అప్పటికీకవికి ౫౦ సంవత్సరముల వయసుండెనని తలంపవచ్చును. అదినిజమయినచో నితఁడు శ్రీనాథునకంటె వయసునఁ గొంచెము చిన్నవాఁడైనను నాతనికాలమున నీతఁడు గ్రంథరచనము చేసినవాఁడని చెప్పుటకు సంశయము లేదు. ఇతనిగురువు చక్రవర్తియను శ్రీవైష్ణవుఁడైనట్లు పైపద్యము వలనఁ దెలియుచున్నది.

ఛందోదర్పణము నాలుగాశ్వాసములు కలది. ఈగ్రంథమును ౧౯౨౧ వ సంవత్సరములో వావిళ్ళవారు ముద్రించి యున్నారు. దీనికి గిడుగు వెంకటసీతాపతిగారు ౮౩ పుటలుగల పీఠికనువ్రాసి గ్రంథమునకు వన్నె తెచ్చియున్నారు ఈఛందోదర్పణమును "అనంతుని ఛందము" అని వాడుచుందురు. సులక్షణ సారాప్పకవీయాదులలోవలె నీగ్రంథమునందలి లక్షణములకు లక్ష్యముల నితరకవులనుండి గైకొనక లక్ష్యములనుగూడ నీతఁడేరచించియున్నాఁడు. ఈగ్రంథము భగవంతున కంకితమీయఁబడినది. ఈగ్రంథపీఠికలో బయ్యన బిరుదు

"భవ్యభారవి" అనియున్నది. భవ్యభారతి కాని భారవికాదు. ఇది యచ్చుపొరపాటైయుండును.

రసాభరణముకూడ నాల్గాశ్వాసములు కలదియే. ఇది ధ్రువపట్టణమందలి యీశ్వరున కంకిత మీయఁ బడినది. ఈధ్రువపట్టణమేదియో తెలియలేదు. ఏగ్రామనామమునో సంస్కృతీకరించి ధ్రువపట్టణమనినాఁడని తోఁచుచున్నది. తండ్రినివాసము పెరమకూరు అని పైని వ్రాసియుంటిని. ఇదికృష్ణామండలములోని బెజవాడ తాలూకాలోనున్న పెనమకూరుగాఁగొందఱు భావించిరి. కానియీగ్రామములోఁ బూర్వము కవులున్న జాడలేదనియు ననంతామాత్యుని తండ్రి నివాసమదియేయని నిశ్చయించుటకుఁ దగినయాధారములు గాన రావనియు నాగ్రామములో నర్వాచీనమైన చెన్న మల్లేశ్వరాలయము దక్క వైష్ణవాలయములు లేవనియు నాయూరఁ గౌండిన్యగోత్రులగు బ్రాహ్మణులు లేరనియు నాగ్రామవాస్తవ్యులును విద్వాంసులునగు పెనమకూరు సుబ్బారావుగారు వ్రాసియున్నారు. కావునఁ గవినివాసము పెనమకూరు కాఁజాలదు.

తనతండ్రిగ్రామము కృష్ణవేణ్ణా మలాపహారిణీ భీమరధ్యంతర్వేది సంస్థితమై యున్నదని పైపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు. ఈమూఁడు నదులును గలిసినచావున నిదియున్నదని తలంపరాదు. వేణ్ణ, మలాపహారిణి, భీమరథీనదులు కృష్ణ కుపనదులు. కృష్ణాతీరముననే యీగ్రామముండెనని భావింపవలసియుండును. పెదకోమటి మాచారెడ్డి కుమారుడైన తిప్పారెడ్డి వ్రాయించిన చెఱకుమిల్లి శాసనములోఁగూడ "కృష్ణవేణ్ణామలాపహారిణీ భీమరథ్యంతర్వేది సంస్థితమ్. భోగైశ్వర్యాష్ట సంయుక్త మేకమూరుం పురోత్తమమ్" అని వాడియున్నాఁడు. పెరమగూరు శ్రీకాకుళమునకు సమీపమున నుండియుండును. కవితండ్రియైన తిక్కనామాత్యుఁడీ శ్రీకాకుళమునందలి యాంధ్రదేవునకు భక్తుడు కవికూడ పెరమగూరు వాస్తుఁడై

యుండుననియే తలంపవలసి యున్నది. ఈతఁడు తన నివాసగ్రామ మేదియో చెప్పలేదు. ఏప్రభువునొద్దను నుద్యోగినని చెప్పలేదు. అందుచేఁ దండ్రినివాసమే యీతని నివాసమని చెప్పఁ దగియున్నది. కాని యీయూహ నిశ్చయమని తలంచుట కాధారములు లేవు.

పైనఁజెప్పిన ధ్రువపట్టణము గుంటూరుమండల మందలిధూళి పూఁడిగా యుండునని కొందఱనుచున్నారు. కాని యదినాకుఁదృప్తి కరముగాఁ గన్పట్టలేదు. ధ్రువశబ్దమునకు మట్టి, మోదు అని రెం డర్థములు కలవు. మట్టిపూఁడి, లేక మట్టివాడయను పేరును ధ్రువ పట్టణమని కవి సంస్కృతీకరించినాఁడని నాయభిప్రాయము. కృష్ణా మండలమున గన్నవరముతాలూకాలో "మట్టివాడ" యున్నది. దివితాలూకాలో 'మోదుమూడి' యున్నది. వీనిలో నేదియైనఁగాని, ఇట్టిదేమఱియొక గ్రామముగాని యైయుండునని నాయభిప్రాయము. మొత్తముమీఁదనీకవి కృష్ణామండలమువాఁడై యుండునని నాయూహ. రసాభరణమునం దన్ని తావులను ధ్రువపట్టణమనియే వాడియు న్నాఁడు. కాని నిజనామమును సూచించుపదము నెచ్చటను జెప్ప లేదు. తుదకాపట్టణమందలి దేవుని పేరును గూడఁ జెప్పలేదు. ద్వితీ యాశ్వాసాంతపద్యమున "ధ్రువపురమందిరుఁడు వ్రజవధూవరుఁ డుర్విన్" అనియును తృతీయాశ్వాసాదిపద్యమున "ధ్రువపట్టణేశుఁడు ......రక్షించు రుక్మిణీశుఁడు మమ్మున్" అనియును జెప్పియుండు టచే నీకృతిపతి, శ్రీకృష్ణుఁడని తలంపవచ్చును. ధ్రువపట్టణమున గోపాలకృష్ణాలయమో, వేణుగోపాలస్వామి యాలయమో యుండి యుండును. ఈతనిగ్రంథములు నరాంకితములు కాలేదు. ఈధ్రువ పట్టణమే కవినివాసమై యుండునని యూహ కలుగుచున్నది.

ఈకవి అక్షరము లేఁబదియని చెప్పటలో ఛందోదర్పణమున 'క్ష' యనునక్షరమును బ్రత్యేకాక్షరముగా లెక్కించి, ళళలకు భేదము లేదను కారణముచే "ళ" ను లెక్కలోనికిఁ దీసికొనలేదు. ఆవిషయ మీక్రింది రెండుపద్యములలో నున్నది.

క. యరలవలంతస్థలు. నాఁ
బరఁగును శషసహాలు తేటపడు నూష్మలనన్
సొరిది. క్షకారముఁగూడఁగ
సరి నేఁబదియయ్యె వర్ణసంఖ్యధరిత్రిన్.

క. శలలకు భేదములే దను
పలుకున శాబ్దొలఁగి యైదుపదులగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి
తెలుగున అళలనఁగ రెండధికమంద్రుమహరీ !

మంత్రశాస్త్ర విషయమునందక్క దక్కినవిషయములలో క్ష
కారము సంయుక్తాక్షరముగాఁ బండితులు పరిగణించుచున్నారు. శ
కారము సంస్కృతాక్షరముగ నే యెన్నఁబడుచున్నది. ఇందునుగూర్చి
అప్పకవి యిట్లు వ్రాసియున్నాఁడు.

తే. ఆగమజ్ఞులు దొడ్డబీజాక్షరంబు
లందు లేకున్కి సన్నంబునదియుఁగూడ.
నొకటిగాఁ జేసి బీజోపయోగిగాన
తాను జేకొనిం దకశబ్దసరణిగాదు.

తే. కాకుమా. జడ్డయైన క్షకారమగుట
దలఁప కేఁబది లిపులలోఁ దానిఁ గూర్చి.
తొలుత భిన్నాక్షరం బైనదొడ్డళాను
విడిచిపెట్టె ననంతుండు వెఱ్ఱిగాఁడె.

అప్పకవి యభిప్రాయమునంగీకరింపక యప్పకవియే వెఱ్ఱివాఁడని
కొందఱసిరి.

రసాభరణము సంపూర్ణమైన యలంకారగ్రంథముకాదు. రస
మునుగూర్చిమాత్రమే యిందుఁజెప్పఁబడినది. కావ్యలక్షణములు
అలంకారవిషయములు నిందు లేవు.

శ్లో. శృంగారహాస్యకరుణా। రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుత శాంతాఖ్యా। రసాఃపూర్వై। రుదాహృతాః॥

నవరసలక్షణములును వానియంతర్భేదములును శృంగారరసవివరణ సందర్భమున హావభావాది విషయములును నాయికానాయక లక్షణములు సోదాహరణముగా నిందుఁ జెప్పఁబడినవి. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియందు ప్రథమద్వితీయోల్లాసముల యందును దృతీయోల్లాసమున గొంతవఱకును జెప్పినవిషయములే యిందు జెప్పబడినవి. లక్షణముల కుదాహరణముల నిచ్చుటలోఁ గొన్ని తావులఁ బెద్దనకంటె ననంతుని దే పైచేయియైనదని నాయుద్దేశము. పెద్దనశైలికంటె ననంతుని శైలిసులభమై సామాన్యులకుఁ గూడ దెలియునట్లున్నది. పెద్దనశైలి కృతిపతి నామముద్ర వలయునను నియమము లేకున్నచోఁ జక్కగానుండి యుండును. రసాభరణము సంస్కృతగ్రంథమున కాంధ్రీకరణముగాక స్వతంత్ర గ్రంథమువలెఁ గన్పట్టుచున్నది.

అనంతామాత్యుఁడు రచించిన భోజరాజీయ మేడాశ్వాసములు గలది. అహోబలనరసింహున కంకితమైనది. ఇందు భోజరాజు పూర్వజన్మ వృత్తాంతమును నీజన్మమున నాతడొనర్చిన యద్భుత కార్యములును బ్రసక్తానుప్రసక్తముగ ననేకచిత్రకథలును జెప్పబడినవి. ఈకావ్యమందలి వర్ణనలు స్వభావోచితములై లోకోక్తులతోఁ గూడి మనోహరముగా నుండును ఈకవికవిత్వము ద్రాక్షాపాకమున నిర్దుష్టమై పాఠకుల కింపు గల్గించుచుండును ఉత్తమ కావ్యములలో నిదియొకటిగాఁ నెన్నఁదగినది. ఇతివృత్తమును సొగసుగా నున్నది. ఇందు నీతినిబోధించు పద్యములును గథలును బెక్కులున్నవి. శృంగారము ప్రధానరసమైనను నది పచ్చిగాలేక యుచితరీతినున్నది.

ఈతని కవిత్వశైలి తెలియుటకై యీతని గ్రంథముల నుండి కొన్నిపద్యముల నుదాహరించి యీకవిచారిత్రమును ముగించెదను.

రసాభరణము: శాంతరసము:

ఉ. మ్రొక్కిన వెక్కిరించినను మోదినగంధము దెచ్చి పూసినం
ద్రొక్కిన నెత్తుకొన్నఁ గృపతోఁ గుడిపించినఁ బస్తువెట్టిన
న్నిక్కను స్రుక్కులేక తరుణీజనులందును మ్రాకులందుఁ దా
నొక్కవిధంబ కా మెలఁగుచుండు మహాత్ములఁ జెప్పనొప్పగున్.

బిబ్బోకము:

ఉ. ఆతతసంపదాఢ్యుఁడగు నంతియకాదు వదాన్యుఁడౌ జగ
జ్జాతసముల్ల సద్భరణశాలి భుజాపరిఘుండు నౌ కళా
స్ఫీతుఁడు నౌ మురారి యని చెప్పఁగనేల ప్రియోక్తు లల్పమా
దూతిక చాలుఁ జాలు మరుతూపులు దాఁకినఁదాఁక నీతుదిన్.

ఆవేగము :—

చ. అడరఁగ గోపకృష్ణుని విహారమహోత్సవభేరి మ్రోయఁ గాఁ
బడఁతులు చూడ వేడ్కపడి భాసురరత్నవిభూషణాఢ్య ము
ల్వెడ వెడ సంతరించుచును వీడ్వడఁ బూనుచు సంభ్రమింపుచు
న్వడిఁ జనుదెంచి యెక్కిరి సువర్ణమయోన్నత సౌధశృంగముల్.

మూర్ఛ:

చ. అతులతపః ప్రభావమహితాత్ముల కైనను గానరాని య
చ్యుతుఁడు లతాంగి నెమ్మనము సొచ్చి సుఖస్థితి నున్నవాఁడు నేఁ
డతని భజింతమంచు శ్రవణాదులు దద్గతవృత్తినుంట నా
యతివ సఖీజనంబు భయమందగ నున్నది నిశ్చలాకృతిన్.

పరకీయ :

ఉ. అత్తయు నూరలేదు మగఁడా మఱి మందకుఁబోయి రాఁడు నే
నిత్తఱినొంటి నుండుదనియేఁ జనుదెంచితిఁ గృష్ణరాయ నీ
చిత్తమెఱింగి మ్రాలదెసఁ జీఁకటి దాఁచినదాన వెన్న గో
డొత్తుననుండి యేల నను నూరకె చూచెదు త్రొంగిచూపులన్.

వాశకసజ్జిక :

చ. సుదతి నిజాస్యదీధితులు సోఁకి కరంగు విహారగేహముల్
పొదలు శరీరవాసనలఁ బొంపిరివోవఁగ జేసి పాన్పుపు
న్మృదువుగఁ జేసి క్రొవ్విరుల మేను నవీనవికాసలక్ష్మి కా
స్పదముగఁ జేసి నీదగు ప్రసన్నసమాగతిగోరి యచ్యుతా!

మన్మథమాహాత్మ్యము :

క. కూఁడుడిగించు నశోకము
వాడించును మల్లెవిరి వివర్ణతఁ జేయుం
జూడఁగఁ జూతము తలఁపులు
జోడించును దమ్మి చంపిచూపుం గలువల్.

ఛందోదర్పణము :

చ. అతనిదశావతార విభవాతిశయంబున లోకమెల్ల శా
శ్వతమగు చాడ్పునన్ భజన సమ్మతరంగ దశాక్షరాభి శో
భితమగు వాక్ప్రపంచ మది పెద్దయుఁ బ్రస్తుతినొందు నట్టిచో
నతఁడును నన్మహాక్షరచయంబు జయంబునొసంగుఁగావుతన్ ౧౮

చ. ఒగిఁ బదుమూఁడుకోటులును నొప్పఁగ నల్వదిరెండులక్షలున్
దగఁ బదునేడు వేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదారు గదా సమవృత్తభేదముల్
ప్రగుణిత లక్షణస్ఫురణఁ బంచినచందము లిర్వదాఱిటన్. ౨౮.

గీ. ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాట వెలఁది యందు
నుత్సుకత నొనర్చి యుత్సాహ మది నిల్ప
విషమసీసమమరు విపధిశయన! 3 ౮

ఉ. రాజులు పాడిఁదప్పక ధరావలయం బఖిలంబు నేలెడిన్
భూజనరాజి సంపదలఁ బొంపిరివోని సుఖానుభూతిచే

నోజఁ జరింపుచుండెడిఁ బయోజసముద్భవకల్ప శాశ్వతం
బై జలజోదరాంకిత మహాకృతి సన్నుతి నొందుచుండెడిన్. ౮౯

భోజరాజీయము :

చ. వెలయఁ బ్రయాగమందు నొకవిప్రున కన్నముఁ బెట్టిరేని న
య్యలఘుఫలంబు కోటిగుణమై యొదవుం గ్రతు వాచరించినన్
దలకొని యాగభాగములు తార భుజించుచుతూహలంబునం
దొలఁగక దివ్యతేజమునఁ దోఁచును దేంతురు వేల్పులందఱున్. ౧అ

ఉ. అర్వురు చక్రవర్తులఁ బదార్వురు రాజులు నేఁటివారలే
యుర్వి బహుప్రకారముల నొప్పుగఁ బాలనచేయరే గుణా
ఖర్వులు వారలుం జనిరి కాదె తదీయయశంబు లెల్లెడం
బర్వుట సత్కవీంద్రకృతభాషిత సత్కృతిమూలమే కదా. ౨అ

మ. మిగులంజక్కనివాఁడు కాంచనరుచిన్ మేదించిన ట్లుంగకాం
తిఁగడుం బొల్పగువాఁడు యౌవనమదోద్రేకంబుచం దద్దయుం
జిగి సొంపారెడువాఁడు మాకడకు వచ్చెన్ జేగ నేఁటా డుచున్
జిగురుంబోడియు వానిఁ జూచి తగిలెన్ జెప్పంగ నింకేటికిన్. ౩అ

శా. జామాతృప్రముఖ ప్రభూత్తమజనుల్ సంతృప్తు లౌ నట్లుగా
హేమాపాత్రములన్ చతుర్విధములై యింపారునాహారముల్
ప్రేమాధిక్య మెలర్ప షడ్విధ రసోపేతంబుగాఁ బెట్టె సు
త్రామానేకమహావైభవం బెసఁగ నాధాత్రీశుఁ డత్యున్నతిన్ ౪అ

క. అతివలమాయలు పెక్కులు
పతుల మొఱఁగఁ దలఁచిరేని పట్టఁగ వశమే
పతిభక్తి నిరతలగు న
య్యతివలు గైకొనరుగాక యాదుర్గుణముల్. ౫అ